సంపుటము 26 శ్రీ సంచిక 1
ఆంధ్రరాష్ట్ర

# ప్రారంభవిద్య

(విద్యావిషయిక మాసపత్రిక)

మే 1937.

సంపాదకులు.— శ్రీయుత జోశ్యుల వెంకట్రావుగారు, బి.ఏ., బి.యిడి., టీచరు,
మ్యునిసిపల్ హైస్కూలు, ఏలూరు.



విషయసూచిక





వ్యవస్థాపకులు: శ్రీయుత ఈదర వెంకయ్యపంతులుగారు, ప్రొప్రయిటరు, రామా అండ్ కో., ఏలూరు.

సంవత్సర చందా
రు 1-8-0
(పోస్టేజితోసహా)

Printed by Mr. E. Venkayya Pantulu
at his Pattabhirama Press, Ellore.

ఆంధ్రరాష్ట్ర

# ప్రారంభవిద్య

విద్యావిషయిక మాసపత్రిక.

| సంపుటము. 26 | ఏలూరు—మే 1937. | సంచిక. 1 |
| --- | --- | --- |



"సరస్వతి నమస్తుభ్యమ్ వరదే కామరూపిణి
విద్యారంభమ్ కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా"

## స్వవిషయం.

శ్రీ ఆఱవజార్జిచక్రవర్తిగారి పట్టాభిషేకము మాపత్రికకొక విధముగా ముఖ్యమైయున్నది. 26 సంవత్సరములక్రిందట సరిగా ఐదవజార్జి చక్రవర్తిగారి పట్టాభిషేకసమయమున మా "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య"ను మొదటిసారి ప్రచురించియున్నాము. ఏడాదిక్రితము వరకునూ ముఖ్యముగా కీర్తిశేషులయిన వలివేటి శాయన్న శాస్త్రి M.A, L.T, విద్వాన్ గరిమెళ్ల సోమన్న పంతులు M. A, L T., గార్ల సంపాదకత్వము క్రింద ఆంధ్రరాష్ట్ర విద్యాప్రపంచమునకు తాను చేయగల అల్పసేవచేయుచూ వచ్చినది. ఈమధ్య మాత్రము సరిగా ప్రతినెలయు వెలువడుటకు చాలా ఆటంకములు వచ్చినవి. తిరిగి శ్రీ ఆఱవ జార్జిచక్రవర్తిగారి పట్టాభిషేక సందర్భమున పునరుద్ధరింపబడుచున్న మామాసపత్రికకే యాటంకములునూ లేక ప్రతినెలయునూ సకాలమునకు వెలువడి చిరకాలము వెనుకటివలెనే ఆంధ్రరాష్ట్ర విద్యాసేవ చేయగలదని నమ్ముచున్నాము.

## పత్రికాశయములు.

"ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య" గావున మన తెలుగు జిల్లాలలోని ప్రాథమికవిద్యనుగూర్చి ముఖ్యముగా తెలియపరచునూ సెకండరీ ఎడ్యుకేషనుకు సంబంధించిన విషయములునూ, మన తెలుగుజిల్లాలేకాక యితర రాష్ట్రములలోని విద్యావిషయములనూ పిల్లవాని మనఃప్రవృత్తిని ఉపాధ్యాయులకు మాటిమాటికిని జ్ఞాపకము చేయునట్టి వ్యాసములునూ, చిన్నతరగతులకు చెప్పెడి కొన్నికొన్ని పాఠములకు టీచింగు నోట్సునూ, ఉపాధ్యాయులు వారివారి సంఘముల ద్వారా విద్యనుత్తమస్థితికి దెచ్చుటకు చేయుచున్న కృషినీ, ఇతర పత్రికలకు దూరమైయున్న గ్రామోపాధ్యాయులకు తెలియుటకుగాను వింత విశేషములునూ, సిలబస్సులలో లేకపోయిననూ కేవలము బడిపిల్లలకు మాత్రము నేర్పదగిన

స్కౌటింగు, రెడ్ క్రాస్ విషయములునూ సోదరోపాధ్యాయులకు మాపత్రిక ద్వారా తెలుప దలచి యున్నాము.

### ఉపాధ్యాయ సంఘములు.

సంఘములవలన ప్రయోజనమేమి? అని అడిగెడివారు ఒక్కమారు దక్షిణభారత ఉపాధ్యాయ సంఘము (South Indian Teachers' Union) చేయుచున్న కృషిని పరిశీలింతురుగాక! 'విద్యావిషయిక వార్తల'లో దీనిని గూర్చి టూకీగా చెప్పబడియున్నది. 28 సంవత్సరముల నుండి యీ సంఘము అద్భుతమైన పనులను చేయుచున్నది. ఇప్పటికి దీని కొకప్రత్యేక వ్యక్తిత్వము వచ్చినది. కాని దక్షిణముననున్న తమిళ జిల్లాలు మాత్రమే ఎక్కువగా దీనికిచెందియున్నవి. 4, 5 సం॥ క్రిందట మన తెలుగు జిల్లాలవారు ఆంధ్రటీచర్ల ఫెడరేషను అనుదానిని లేవదీసినారు. సరిగా 4 సంవత్సరములైన పూర్తికాక పూర్వమే దీనికి గోదావరీ తీరమున నిద్రపట్టినది. అది తిరిగి ఎప్పటికి లేచునో ఎవరికిని తెలియదు. 'కలౌసంఘః' అన్నట్లు ఈ కలియుగమున ఏపనినైనను సంఘముల ద్వారాతప్ప చేయలేము. ఇదివరకులేనిచోట్ల సంఘములు స్థాపింపవలెను. ఉన్నచోట్ల వాటిని బలపరచు టవసరము. బలమైన సంఘము లున్నచోట్ల వాటిలో కేవలమూ ఉపాధ్యాయులకు సంబంధించిన విషయములే కాక అసంతృప్తిగ నున్న ప్రస్తుత విద్యావిధానము నెట్లు మార్చిన బాగుండునో కూడ ఆలోచించు టత్యవసరము.

దక్షిణభారత ఉపాధ్యాయసంఘమున కింత ప్రాముఖ్యత వచ్చుటకు ముఖ్యమైన కారణము దానితరఫున నడుపబడుచున్న South Indian Teacher అను ఆంగ్లమాసపత్రికయు, Balar Kalvi అను తమిళపత్రికయు. మన తెలుగు జిల్లాలలోని ఉపాధ్యాయ సంఘము లేవైనఒక్క తెలుగు మాసపత్రికను నడుపగలిగినవా? తాము అట్టివానిని ప్రత్యేకముగ నడుపలేక పోయిననూ మన ఆంధ్రరాష్ట్రములో విద్యాసేవ చేయుటకుమాత్రమే నడుపబడు చున్న మా ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యవంటి ఒకటిరెండు తెలుగు పత్రికలనైననూ తమ పత్రికలుగా భావించి వీటిద్వారా తమతమ అభిప్రాయములను ప్రచురించుకొనుచున్న మంచిదని తమకు తోచిన ఉపాధ్యాయులట్లు చేయుదురుగాక!

### ఉపాధ్యాయుడు — గౌరవము.

ఉపాధ్యాయునకు తగిన గౌరవ మీరోజులలో లేదనుమాట సత్యమే, కాని ఆగౌరవమును ఎవ్వరునూ మనకు చేతికీయలేరు. దానిని ఉపాధ్యాయులు తమంతటతామే సంపాదించుకొనవలసియున్నది. శ్రీయుత సి. రాజగోపాలాచారి గారు చెప్పినట్లు "నేను యితరవృత్తులవారికన్న హీనుడను" అనే భావము ముందు ఉపాధ్యాయులే తమమనస్సులనుండి వెడల గొట్టుకొనవలెను. తన్నుతానే గౌరవించుకొనుచూ గౌరవహాని కలుగుపనులేమీ చేయకుండ నుండినమంచి పలుకుబడిని గౌరవమును ఉపాధ్యాయుడు సంపాదించగలడు. వస్తుతః యీవృత్తిగౌరవమయినదే కాని ఉపాధ్యాయుడు పలుకుబడిని, గౌరవమును సంపాదింపలేకుండుటకు కొన్ని సహజమైన కారణములున్నవి. (1) జీతముతక్కువ (2) చిన్నపిల్లలతో మాత్రమే ఎప్పుడునూ పని (పురజనులతో పరిచయము తక్కువ) (3) బోర్డుమెంబర్లకునూ, మ్యునిసిపల్ కౌన్సిలర్లకును, వారివారి బంధుమిత్రులకనూ లొంగి యుండవలసి వచ్చుట (ఎయిడెడ్ స్కూళ్ళలోనియు గవర్నమెంటు స్కూళ్ళలోనియు ఉపాధ్యాయులకిట్టి యవసరముండదు). అయిననూ వారివారి ప్రవర్తనలవల్ల

గణ్యతనొందిన ఉపాధ్యాయులు లేక పోలేదు. ఈ పత్రికలో వేఱొకచోట బ్రహ్మశ్రీ దోనేపూడి సుబ్బారాయుడుగారిని వారి రిటైర్మెంటు సందర్భమున ప్రాతవిద్యార్థులు ఎట్లు సన్మానించినారో వ్రాయబడి యున్నది. దీనినిబట్టి పౌరుల ఆదరణకునూ, గౌరవముకునూ ఉపాధ్యాయులు కూడ పాత్రులు కాగలరని స్పష్టమగుచున్నది.

## ప్రస్తుత విద్య.

ఎలిమెంటరీ స్టేజిలోనూ, సెకండరీ స్టేజిలోనూ కూడ ప్రస్తుత విద్యావిధానము మనకే కాదు, విద్యాధికార్లకునూ, గవర్నమెంటువారికిని కూడ మిక్కిలి అసంతృప్తి కరముగనున్నది. మనదేశములోని అన్ని రాజధానులలోనూ Reorganisation Proposals అతి తీవ్రముగా చర్చించు చున్నారు. మన చెన్నరాష్ట్రములో ప్రచురించిన జి. ఒ. 2611 (ఈపత్రికలో దాని సారాంశము వేరొకచోట వ్రాయబడినది) నుబట్టి చూడ దేశములోని విద్యరానితనమునకు కారణములుకొన్ని తెలియుచున్నవి. పిల్లలనుసర్వసామాన్యముగా 6 వ ఏట బడికి పంపుచున్నాముకాని, వారు అధమము 5 తరగతులవరకైననూ చదివి శాశ్వతముగా చదువనూ వ్రాయనూ నేర్చిన వారగుటలేదు. 1931 వసం॥ లో 1 వ తరగతిలో జేరినసుమారు 12 లక్షలపిల్లలలో 1935 లో 5 వ తరగతికి మిగిలినవారు 1 లక్షమాత్రమే. ఇట్టి పరిస్థితులను బాగుచేయు నుద్దేశ్యముతో విద్యావిధానములో కొన్ని మార్పులను గవర్నమెంటువారు చేయనున్నారు. ఒకడేఉపాధ్యాయుడుండెడుస్కూళ్లకు గవర్నమెంటు సహాయముండదన్నారు. ఉన్నఉపాధ్యాయులు తృప్తితో పని చేయుటకు 1, 2 రూపాయలు వేతనమును హెచ్చించినారు. ఇట్టి ఉపాధ్యాయుల మీాదసరియైన అజమాయిషీ అవుసరమని ఇన్‌స్పెక్టర్ల సంఖ్య హెచ్చించినారు. ఇట్టి మార్పులవలన మాత్రమే రాష్ట్రమున విద్యరాని తనము నశించునాయని సంశయించుచున్నాము!

ఈ సందర్భమున తంజావూరులో జరిగిన 28వ చెన్నరాష్ట్ర విద్యావిషయిక సభలో S. I. T. U. వారు ఆమోదించిన రి ఆర్గనైజేషనుప్రొపోజల్సును (వేరొకచోట ఈపత్రికలో ఉన్నవి) పాఠకులు చదివెదరుగాక! ఆస్కీము చాలాఅనుభవజ్ఞులైన ఉపాధ్యాయులచే తయారుచేయబడినది. ఆస్కీమును గవర్నమెంటువారు పరిశీలించి అవుసరమైనమార్పులతో 'స్కూలుబోర్డు'లను నెలకొల్పిన యెడల రాష్ట్రమున విద్యరాని తనమునశించుటే కాక ప్రాథమికవిద్య చాలా ఉచ్ఛస్థితికిరాగలదు.

బ్రహ్మశ్రీ దోనేపూడి సుబ్బారాయుడుగారు ఏలూరులోని ఎలిమెంటరీ పాఠశాలలో 1896 సం॥ లగాయతు నేటివరకును ఉపాధ్యాయులుగ నుండి రిటైరు అయిన సందర్భమునజరిగిన వీడ్కోలు సభలో వారిచ్చిన ఉపన్యాసమును చదువరులు పరిశీలింతురుగాక! పూర్వము ప్రాథమిక విద్య ఎట్లుండెడిదో వారు చక్కగా తెలిపియున్నారు. అప్పటిపిల్లలు యిప్పటివారికంటె వయస్సులో పెద్దవారుగ నుండెడివారు కావున వారుచెప్పిన అన్ని విషయములనూ ప్రస్తుత విద్యావిధానములో మనము అమలులో పెట్టలేక పోయిననూ చక్కని దస్తూరీవ్రాయించుటయు, శతకములను చదివించుటయు మొదలైనకొన్ని విషయములనైననూ తప్పనిసరిగా ఎలిమెంటరీపాఠశాలలో ఆచరణలో పెట్టించుటకు విద్యాధికారులు తగు యేర్పాటులను చేతురుగాక!

# పిల్లల ఆటలు.

జె. కె. సరస్వతీభాయిగారు బి. ఏ, యల్. టి.,

పిల్లలకు ఆటలయందెక్కువ ఆసక్తి. ఇంకను 5 లేక 6 సంవత్సరములు ప్రాయముగల పిల్లలకు ఆటలయందాశ మెండు. ఏవస్తువును జూచినను వారికి చిత్రముగ నుండును. కాన, వాటిమీద వారు పలుమారు ప్రశ్నలు వేయుచుందురు. అట్టి తరుణములందు తల్లి దండ్రులేమాత్రమును లక్ష్యపెట్టక వారి ప్రశ్నలకు ప్రత్యుత్తరములిచ్చి వారిని తృప్తిపరచవలయును. పిల్లల స్వాభావికమైన పరిశోధకి బుద్ధిని ప్రోత్సహింపని యెడల వారు బుద్ధిహీనులును, మందబుద్ధులును అగుదురు. మన దేశమందు తల్లి దండ్రులందరును విద్యావంతులు కానందున పిల్లల విద్యాభివృద్ధికి తోడ్పడుట కసమర్థులైయున్నారు. అయినప్పటికిని వారికి తెలిసినంతవరకును పిల్లల ప్రశ్నలకు వుత్తరములిచ్చి వారు సంతోషపడు లాగున చేయవలయును.

పిల్లలకు ఐదు సంవత్సరముల వయస్సు వచ్చిన పిమ్మట అనుకరించు ఆటలందును మనః కల్పితమగు నాటలయందును ఆశ అధికము.

తార్కాణములు:—

1. కృష్ణలీల నాటకము చూచిన (పిల్లలు, బాలురు) వారిలో నొకడు కృష్ణునిగను కొందరు గోపికలుగను భావించి నటింతురు.

2. పుస్తకములను గాని, అగ్గిపెట్టెలను గాని వరుసగా యుంచి పొగబండి యని భావించి ఆటలాడుదురు.

3. కఱ్ఱల రెండు కాళ్ళ నడుమ యుంచుకొని గుఱ్ఱపుసవారి చేయునట్లు తలంతురు.

4. బొమ్మలను చేయించుకొని తలంటి నీరు పోసి వుగ్గుపోసి 'బిడ్డ' అని కొందరు జోకొట్టుదురు.

5. బాలుడొకడు బహు చమత్కారముగా బండితోలువానివలె నటించుచుండగా, తల్లి సంతసించి ముద్దిడునపుడు "అమ్మా! బండి తోలువాని నెవరైన ముద్దిడుదురా?" అనితల్లి నడిగెనట. కాబట్టి పిల్లలు ఆటలాడునప్పుడు తాముపహించిన పాత్రములన్నియు నిజమని భావింతురు.

ఇట్లు ఆటలయందు ఆసక్తియును మనోదార్ఢ్యమునుగల పిల్లలుబడికి వచ్చునపుడు వుపాధ్యాయులు వారి ననుసరించి పా ఠ ము ల ను, ఆటలమూలముననే నేర్పవలయును. వారికికథలు మున్నగువాటిని నేర్పవలయును. శక్తికిమించిన ఆటలనుకూడ పిల్లలు ఉత్సాహముతో నాడుదురుకాని చిన్నపనిచెప్పిననేదో ఒకసాకు చెప్పుదురు. కనుక చదువును,పిల్లలు ఒక పెద్దపనివలె భావించకుండ వుపాధ్యాయులు ఆటల మూలముననే పాఠములను నేర్పవలయును. పిల్లలను పెద్దవారివలెప్రొద్దున 10 గంటలు మొదలుకొని సాయంత్రము 4 గంటల వరకు మనస్సు నాకర్షించు వస్తువులులేని బడియందు కూర్చుండబెట్టి కదలక, మెదలక నోరుతెరవక యుండుమని వుపాధ్యాయులు చేతకఱ్ఱపట్టుకొని నిలువబడిన వారికి బడికివచ్చుటకు ఎంతమాత్రము యిష్టముండునో మనముగ్రహించవచ్చును. పిల్లలు భయపడి మరుసటిరోజు బడికిరారు. కాబట్టి, వుపాధ్యా

యులు పిల్లలతో కలసిమెలసి చనువుగాయుండి ఆటలమూలమున, చిత్రములమూలమున చదువు నేర్పిన వారిని తల్లిదండ్రులవలె ప్రేమించుట యేగాక బడెనియింటికంటె రెట్టింపు యింపైనదిగా ప్రేమించిన వారగుదురు.

ఇవిగాక మొదటి తరగతిపిల్లలకు ప్రతి దినమును ½ గంటకాలము బడితోటల యందు కాని, మైదానముల యందుకాని ఆటలునేర్ప వలయును. సాధారణముగా బాలికల ప్రాథమిక పాఠశాలలో పిల్లలాడుటకు స్థలముండదు. అయి నప్పటికిని బడిలోపలనే పిల్లలకు కొన్ని ఆటలు నేర్పవలయును.

పిల్లలకు నేర్పునటువంటి యాటలు సులభ ముగా నుండవలయును, అనగా ఎక్కువ నిబం ధనలుండరాదు. అప్పుడే వారు ఉత్సాహము తోను, స్వేచ్ఛగాను, ఆడుకొనుటకు వీలుండును. పిల్లలకు ఎలుక, పిల్లి, మేక మొదలగుజంతువులుగా భావించుకొనుట యిష్టము, కాబట్టి ఆజంతువులకు సంబంధించిన ఆటలనే నేర్పవలయును.

ఆటలు పిల్లలకు అర్థమగునట్లు మొట్టమొదట చెప్పవలయును. పరుగెత్తునటువంటి యాటలను కొన్నింటిని నేర్పినతరువాత విశ్రాంతిచెందుటకు నిలిచి యాడుకొను నటువంటిఆటలను నేర్పవల యును. గుంపుగనో, లేకజంతువులుగనో యాడు కొనుటకు వీలైన యాటలు నేర్పవలయును.

ఆటలవలన ప్రయోజనములు ఏమనగా:-

1. ఆటలలో క్రమశిక్షనునేర్పునట్లు యింకే పాఠములోను నేర్పుటకు వీలులేదు. పిల్లలకు ఆటలమూలముననే పాఠములను సులభముగా నేర్పవచ్చును. ½ గంట ఆటలలో నేర్పిన విష యములు తరగతియందు దినమంతయు నేర్పిన నను వారికి బోధపడుటకష్టమే.

2. స్వాభావికముగా మందబుద్ధులైన పిల్లలను కూడ ఆటలవలన సూక్ష్మబుద్ధి గలవారలగా చేయవచ్చును.

3. ఆడుటవలన దేహాకారము బాగుపడుట యేగాక మెదడునకు దేహమునకుకూడ అభివృద్ధి కలుగును.

4 ఆటలలో పిల్లలు జాతి భేదములు లేక ఐకమత్యముతోను ప్రేమతోను ప్రవర్తింతురు.

5. సరియైన ఆటలు నేర్పినయెడల పిల్లలకు జ్ఞాపకశక్తియు, భావములును వృద్ధియగును. కాబట్టి ఉపాధ్యాయులు పిల్లలకు ఆటలు నేర్ప వలయును.

సాధారణముగా ఉపాధ్యాయులు, ఆటలాడు టకు పిల్లలను తోటలలోనికిపంపి వారు వారి పను లను చూచుకొందురు. పిల్లలు ఒకరినొకరు కొట్టు కొని తిట్టుకొని ఏడ్చుచు వుపాధ్యాయుల వద్దకు తీర్పునకుపోవుదురు. కాబట్టిపిల్లలతో కలసి మెలసి యాడుచు అట్టి జగడములు రాకుండునట్లు ఉపా ధ్యాయులు చూచుకొనవలయును. పిల్లలకు పాఠ ముల మీదయాసక్తి కల్గుటకును మనోదేహా రోగ్యములకును ఆటలు ముఖ్యముగా నేర్ప వలయును.

---

# బడితోటలు-తోటబడులు.

ముత్తింటి గు॥ వె॥ జ॥ సత్యనారాయణమూర్తి, టీచరు, బారువ గంజాంజిల్లా.

విద్యాభ్యాసమునకు పాఠశాలగదులే ముఖ్య ప్రదేశములుగావు. విరామములేక పాఠముల వల్లింపజేయుటయే విద్య అనుకొనుట పొరపాటు. వుదయమునుండి సాయంకాలమువరకు బాలురను బడియందుంచి పాఠములు వల్లింపజేయు వుపాధ్యాయుడే మేధాగ్రేసరుండని శ్లాఘించు మహనీయులు లేకపోలేదు.

ప్రభుత్వ విద్యానిబంధనల ప్రకారము పతి పాఠశాలకును బడితోటయుండుటత్యావశ్యకము. బాలురు సహజముగా ఆటలయందాసక్తి గల వారుగా యుందురు. అందువలన "కిండర్ గార్టెన్" (Kindergarten) పద్ధతులద్వారా విద్య నేర్పుటవసరము. ఆటవస్తువులు, బడితోటలు, కాగితపు పనులు, ఒంకమట్టిపనులు, చిత్రలేఖనము, దేవాలయములు, నదీతీరములు, సముద్రతీరములు, పర్వత ప్రాంతములు మొదలగు స్తలములకు విహారార్ధము (Excursions) పోవుట మొదలగువాని ద్వారా బాలురకు విద్యయందు విసుగు జనించకుండునట్లు చేయుచు విద్య నేర్పనగును. ఇట్టిసాధనములు ద్వారా నేర్పినవిద్య బాలురకు పెనుభూతము వలెగాక ఆనందదాయకముగా నుండగలదు. బాలుర మనముల నాకర్షించుటకును బడికి శోభను కలుగ జేయుటకును, యివి తోడ్పడగలవు.

పై నుదహరించినసాధనములలో సామాన్యమగు బడితోటలయొక్క వుపయోగముల నించుక యోచింతము. బడితోటల యందు కొన్ని బహువార్షిక వృక్షములున్న నే ఆతోటలు యింపుగొల్పుచుండును. పూలచెట్లు మొదలగునవి కూడ యుండుటవసరము. ఇవిగాక బాలురు స్వయముగా మళ్లుకట్టి విత్తనములువేసి నీరుపోసి మొక్కలను పెంచుటకై కొంతభాగము ప్రత్యేకింపవలెను.

ఇట్టి బడితోటలందు బాలురు స్వయంకృషి వలన కేవలము చిలుకలవలె మాటలనే గాక ప్రకృతి పరిశీలన చేయగల్గుచున్నారు. మనస్సునకానందము కల్గించు రమ్యమైన మొక్కలను, అందమగు పూవులను చూచుచు వివిధవృక్ష, పశుపక్ష్యాదులనిర్మాణమందుభగవానునిఅద్భుతసామర్ధ్యమునుతిలకింపగల్గుచున్నారు. పరిశుభ్రవాయువు పీల్చుటవలనను స్వయంకృషి వలనను శరీరారోగ్యములువృద్ధిపొందుచున్నవి. కొన్ని వ్యాధులు సహితము కుదురుటకవకాశముగలదు. మొక్కలకు వేసవికాలము నీరుపోయుట, గొప్పుత్రవ్వుట ఎరువువేయుట మొదలగువానివలన బాలురు క్రమశిక్షయొక్క ఆవశ్యకతను గుర్తింపగలుగుచున్నారు. చెట్లయందేగాక సకలప్రాణికోటియందును అవ్యాజప్రేమగల్గిన వారగుచు బాలురు భూతదయయందలి ప్రథమపాఠములను బడి తోటలందు స్వశక్తివలన నేర్చుకొనగల్గుచున్నారు. బాలురకు పాఠశాల భవనమందు నేర్పబడిన పాఠములవలన గల్గినవిసుగుదలను బడితోటలుతీర్చి విశ్రాంతిని కలుగజేయుచు మనస్సునకుల్లాసము కల్గించి విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నవి. అందువలన యీబడితోటలు పాఠశాలలకు శోభనుకలుగజేయుచు బాలుర

మనంబుల నాకర్షింపగల సాధనములుగా ఒప్పుచున్నవి.

గాన యిట్టిబడితోటల వుపయోగమును వుపాధ్యాయులు గుర్తెఱుంగుట ప్రాథమిక విద్యావ్యాప్తి కత్యవసరము.

**తోటబడులు:** (Openair Schools )

బడితోటలు యిట్టివుపయోగకరములై యుండుటంబట్టియే పూర్వపుదినములలో మన ఆర్యావర్తమందు విద్యను ఆశ్రమములలో చెట్లనీడను గరపుచుండెడివారు. అట్టితోట బడులందు విద్యాభ్యాస మొనర్చిన విద్యాబృందమే హిందూదేశఖ్యాతిని ప్రపంచమంతకు వ్యాపింపజేయగల్గిరి. ఇట్టితోటబడులు పూర్వము హిందూదేశమందును ప్రస్తుతమున జర్మనీ, నార్వే డెన్మార్కు మొదలగు పాశ్చాత్య దేశములందునుకూడ వ్యాప్తిలోనున్నవి ఇట్టి తోటలలోనే చెట్టునీడనుకూర్చొని న్యూటన్ (Sir Isaac Newton) భూమియొక్క ఆకర్షణ శక్తిని (Law of Gravitation) కనుగొనకలిగెను.

ప్రస్తుతము మనదేశమున నొకపాఠశాలను స్థాపింపవలెనన్న విశేష ధనమును వెచ్చించి పాఠశాలభవనమును నిర్మించి అందుతగినన్ని కుర్చీలు, బెంచీలు, మేజాబల్లలు మొదలగునవన్నియు అమర్చవలెను. ఇంతధనమును వెచ్చించి పాఠశాలలను స్థాపించుటకు స్థానిక సంస్థలే వెనుకాడుచున్నవి. అట్టిస్థితిలో ప్రయివేటుబడులను (Aided Schools) స్థాపించుటకు నిరుద్యోగులగు వుపాధ్యాయుల కెట్లు సాధ్యమగును? అందువలన తగినన్ని పాఠశాలలువృద్ధిపొందుట కవకాశములేకున్నది. నూటికి 8 కన్న తక్కువ సంతకదార్లను గల్గి అజ్ఞానాంధకారములో నిండియున్న ప్రస్తుత హిందూదేశమున విద్యావ్యాప్తి గలుగవలెనన్న యిట్టితోటబడులు త్వరలో స్థాపింపబడి వృద్ధిపొందవలెను. ప్రజాశ్రేయమునుగోరు ప్రభుత్వము త్వరలో యిట్టి విద్యాప్రణాళికను అమలులోనికి తెచ్చుటత్యవసరము.

---

## ఉపాధ్యాయుని గౌరవించుట.

ఏలూరులోని గంగానమ్మగుడివీధి బాలుర పాఠశాల ప్రధానోపాధ్యాయులగు బ్రహ్మశ్రీ దోనేపూడి సుబ్బారాయుడుగారు ఉద్యోగము నుండి విశ్రాంతి తీసికొను సందర్భమున వారి శిష్యకోటిలోని పెక్కుమంది వారి స్కూలులో 8-5-37 వ తారీఖున వారిని గౌరవించుటకు ఒక పెద్దసభ జరిపియున్నారు.

ప॥ గో॥ జిల్లా విద్యాధికారులగు మ॥రా॥శ్రీ జి. దామోదరం మొదలియార్ బి.ఏ., ఎల్.టి., గారు సభకు అధిపత్యమును వహింతురని ఆహ్వానములలో వ్రాయబడెను. కాని వారు కారణాంతరములవల్ల ఊరువిడచి వెళ్లవలసివచ్చినందువల్ల వారిస్థానే శ్రీ రాజా మంత్రిపగడ భుజంగరావువారి ఆస్థాన పండితులైన బ్రహ్మశ్రీ కొత్తపల్లి సుందరరామయ్యగారు అగ్రాసనాధిపతిగా నెన్నుకోబడిరి. అధ్యక్షుని ప్రారంభోపన్యాసమయిన తర్వాత పడమరవీధి ప్రాతవిద్యార్థుల తరఫున సుబ్బారాయుడుగారిని పొగడుచూ

వ్రాసిన పంచరత్నములు చదువబడెను. అటు పిమ్మట ఆస్కూలుకు చెందిన ఉపాధ్యాయుల తరఫున "ప్రేమాంజలి" చదువబడెను. పిమ్మట తోడి ఉపాధ్యాయులగు ములగాల రంగారావు గారునూ, ఉమ్మడిశింగు నారాయణరావుగారును ద్రోణేపూడి సుబ్బారాయుడుగారిని గురించి పెక్కుసంగతులు సభవారికి తెలియజెప్పిరి బోధనచేయుటలో వారి నేర్పునూ, ప్రధానో పాధ్యాయులుగనుండి ఇతర ఉపాధ్యాయులకు చూపిన ఆదరణయూ, స్నేహితులకువారు చేసి యున్న సహాయమునూ, పశ్చిమగోదావరిజిల్లా ప్రాథమిక ఉపాధ్యాయ సంఘమునకు అధ్యక్షుడుగనుండి ఉపాధ్యాయ బృందమునకు చేసిన సేవయు, ఆంధ్రరాష్ట్ర ప్రాథమిక ఉపాధ్యాయ సంఘమునకు కార్యదర్శిగనుండి ఉపాధ్యాయ వృత్తికి వీరిచ్చిన చేయూతయూ మిక్కిలి కొని యాడుచూ వీరు మాట్లాడిన పిదప ప్రాతవిద్యార్థి అయిన కాకి కృష్ణారావుగారు బి. ఏ. సుబ్బారాయుడుగారి బోధనవల్లనే తామీస్థితికి రాగలిగితిరనియు, శ్రీపంతులుగారు కడువృద్ధులయ్యు మంచి వాగ్ధాటితోనూ, ఉత్సాహముతోనూ పిల్లలకు చదువునేర్పియుండిరనియూ చెప్పి తామల్లిన ఒక చక్కని పద్యమును చదివిదానినే తమ గురువుగారికి కానుకగానిడిరి.

ఆపైని ప్రస్తుతము ఆకువీడుబోర్డు మిడిల్ స్కూలులో ఉపాధ్యాయులుగనున్న శ్రీయుత ద్రోణేపూడి సూర్యనారాయణగారు శ్రీ పంతులు గారిని పొగడుచూ ఇట్లనుడివిరి. "నేను శ్రీ పంతులుగారి కుటుంబమునకు చెందినవాడనే. ఇది వరకుమాట్లాడినవారికంటె ఎక్కువబాగుగా శ్రీ వారినినే నెఱుంగుదును. అంతశాంతమూర్తియూ నిరాడంబర జీవియూ మనవృత్తిలో కానరాడు. ఆయనకున్న 40 సంవత్సరముల సర్వీసులోనూ ఒక్కరికైననూ అపకారము చేసిఎఱుగడు. ఈయనకున్న పట్టుదల అద్భుతము. నేటిసమావేశము ఆయనకున్న పలుకుబడికి తార్కాణము. ఆయన క్లాసులో కూర్చొనియుండిన విద్యార్థు లిప్పుడు లాయర్లుగను, డాక్టర్లుగనూ, ఇతరగొప్ప ఉద్యోగీయులుగనుపనిచేయుచున్నారు. ఈసభను చూచి తదితరటీచర్లు కొన్నివిషయములను గుర్తింపవలసియున్నది. మనము కూడవీరివలెనే పౌరుల మెప్పువడసి మనకుదైవమొసగిన యీ ఉపాధ్యాయవృత్తినుండి అతిగౌరవముగవిశ్రాంతి తీసికొను బాధ్యత మనమీదనే ఉన్నది. మనవృత్తి వేతనము విషయములో అది బీదదైనప్పటికిని చేసెడిపనిలో అత్యంతగౌరవప్రదమైనది. మాష్టర్లు అనేకబాధలు పడుచూఉన్నారని నాకు తెలియును. నాకొక్కొక్కప్పుడు ఇట్టిబాధలు ఉపాధ్యాయునిలోనున్న తేజస్సునుపైకి తెచ్చుటకేమోఅని తట్టుచుండును. పుఠము వేసినగదా బంగారమునకు వన్నెవచ్చుట? అటులనే ఉపాధ్యాయుడు బహుబాధలుపడి మిక్కిలిత్యాగముతో చదువుచెప్పుచుండిన వాని శిష్యులు కూడవానిని చూచి నేర్చుకొని త్యాగవంతులయి దేశమునకు కల్యాణమును చేకూర్చగలరేమో! ఒకసారి మావూరు ఒకధనికురాలయిన ఆంగ్లస్త్రీ తన విద్యావంతులయిన ఇద్దరు కుమారులతో వచ్చియుండెను. మావూరి అమ్మలక్కలు కొందరు ఆదొరసానిని "ఏమమ్మా నీవింత భాగ్యవంతురాలవే నీకు నగలేవీ" అని అడిగినారు. అందుకు ఆవిడనవ్వి తనకుమారుల వంకచూపి వారే నానగలని బదులుచెప్పినది. ఆవిధముగానే మనపంతులుగారికి ఏమికొఱంతయునూలేదు. వారు బీదవారుకారు. వారివద్ద చదువుకొని యుండిన ప్రాతవిద్యార్థులందరునూ ఆయనసొమ్మేలే. మన ఉపాధ్యాయ వృత్తిలోనున్నవారందరునూ ఎట్టి నిరుత్సాహమును పడక ఇట్టి భావముతో తమవిధినితాము

నెఱవేర్చుకొందురుగాక యని హెచ్చరించుచున్నాను"

వీరితర్వాత మ్యునిసిపల్ సూపర్వైజరుగారైన శ్రీయుత బెండపూడి రామమూర్తిగారు శ్రీ పంతులుగారు ప్రధానోపాధ్యాయుడుగా ఆస్కూలుకు వచ్చినతర్వాత ఆస్కూలు ఎంత ఉచ్చదశలోనికి వచ్చినదో చెప్పి వారి స్నేహమును గూర్చియు బంధుప్రేమను గూర్చియు ఏవైననూ ఊరిలో కార్యకరాదులు వచ్చినపుడు ఆయన నడుముకట్టుకొని ఎట్లు సహాయము చేసెడివారోదానినిగురించియు సిలబస్‌లో నున్న అంశములు చెప్పుట పూర్తికాగానే ప్రతి సంవత్సరము థమ పిల్లలకు శ్రీ పంతులుగారు తెలుగు లెక్కలను ఎట్లు ఓపికతో బోధించెడివారో ఆసంగతిని గూర్చియూ విపులముగా చెప్పిరి.

తరువాత రామాఅండ్‌కో ఆఫీసులో మేనేజరుగా నున్న శ్రీయుత ఈదర కృష్ణమూర్తిగారు భారతమును శ్రీ పంతులుగారికి తమ కానుకగా నిచ్చిరి మరియొకరు భగవద్గీతనిచ్చిరి. శ్రీవారివద్ద చదువుకొని యుండిన ఏలూరు వారులు ఒక పెద్ద వెండిపళ్లెమును రెండు పెద్ద వెండిపాత్రిలనూ తమగురువుగారి కిచ్చి వారిని సన్మానించిరి పలువురు పూలదండలచే వారి గురువును అలంకరించిరి

అటుపిమ్మట బ్రహ్మశ్రీ దోనేపూడి సుబ్బారాయుడుగారు లేచి తమకుచూపిన గౌరవమునకు చేసిన సన్మానమునకూ ప్రాతవిద్యార్థులకునూ, తోడి ఉపాధ్యాయులకునూ అభివందనము లిచ్చి ఈ ధోరణిలో మాట్లాడినారు "నేను 1896 లో సర్వీసులో ప్రవేశించినాను నాటికినీ నేటికినీ విద్యా విధానములో అనేకమార్పులు కల్గినవి. ఈమార్పులవల్ల విద్య బాగుపడిన దని నేను గట్టిగా చెప్పలేను ప్రస్తుతవిద్య మిక్కిలి అసంతృప్తిగ నున్నట్లు నేనేకాదు, పిల్లల తల్లిదండ్రిలు, విద్యాధికార్లు గవర్నమెంటు వారు అందరూ కూడా ఒప్పుకొంటూనే ఉన్నారు దీనినెట్లుబాగుచేయగలమోచెప్పుటకు సాహసించను. గాని విద్యచాలా తృప్తిగా నుండెడిది అనిఅందరూ అనుకొనేటటువంటి పూర్వపు రోజులలో దానిస్థితి ఎట్లుండెడిదో చెప్పబూనితిని దేవతా స్తోత్రములు, ప్రభవాది సంవత్సరములు, మాసములు, ఋతువులు, దిక్కులు, దిక్పాలకులు, పండుగలు, వేదములు, శాస్త్రములు, పురాణములు, మహారాజులూ, చక్రవర్తులూ, సప్త సంతానములూ, సప్తఋషులూ, సప్తసముద్రములూ, సప్తకుల పర్వతములూ, నవగ్రహములూ, నవధాన్యములూ, నవనిధులూ, నవరత్నములూ, అష్టకష్టములూ, అష్టదిగ్గజములూ, అష్ట ఐశ్వర్యములూ, చతురంగబలములు, 64 విద్యలూ వీటిని గుఱించి తెలిపెడి పెద్ద బాలశిక్ష ఒక టెక్స్టుబుక్కు వ్యాయామము, ధర్మము, నీతి, శీలము, గౌరవము, సహనము, దేవభక్తి మొదలగునవి బోధించు బాలరామాయణము, శతకములు, భారతకథలునూ పిల్లలకు చెప్పు యితర పుస్తకములు ఇవికాక నీతిమంజరి, సుఖశిక్ష అను ఆరోగ్య గ్రంథమునూ కూడ చదివించెడివారు అప్పటి విద్యార్థులకు మనదేశ సాంప్రదాయమునకు తగినట్టులూ, నీతిబోధకమైనట్టియు పద్యములు ఒక్కొక్కనికి కొన్నివేలు కంఠస్థముగా వచ్చుననుటలో సందేహము లేదు. దస్తూరి విషయములో పూర్వముచేసెడి కృషి అద్భుతము. దస్తూరీ అనునది వేరుగానొక సబ్జక్టుగానే ఉండెడిదని చెప్పవచ్చును. అప్పుడు ప్రతికుఱ్ఱవాడును అక్షరములను చక్కగా ముత్యాలకోవలాగు వ్రాయుచుండెడివాడు అప్పుడు ప్రశ్నకు సరియైన సమాధానమిచ్చిన వానిని పైకి పంపి గంటలఖరున మార్కులు వేయుపద్ధతి ఉండెడిది. దీని

వలన ప్రతిబాలుడును చక్కగా పాఠములను చదివివచ్చెడివాడు. ప్రాథమిక విద్యానంతరము సహితము గవర్నమెంటు పరీక్షవుండెడిది. 180 రోజులైననూ స్కూలుకు హాజరయిన తప్ప పరీక్షకు కూర్చుండుటకు అర్హత ఉండెడిదికాదు. అందుచేత పిల్లలు తప్పక స్కూలుకు వచ్చెడివారు. అప్పుడు లీవింగు సర్టిఫికెట్టు పద్ధతి ప్రాథమిక పాఠశాలలకు కూడ ఉండెడిది అందుచేత పిల్లలు ఏదో ఒక స్కూలును నమ్ముకుని ఉండెడివారు కాని యిప్పటివలె ఒక్కొక్క బడిలో పిల్లలు వారిష్టము వచ్చినన్నాళ్లుండి తర్వాత ఇంకొకబడికి పోవు ఆచారముతక్కువ. విద్యాధికార్లు పూర్వము ఒక్కొక్కపిల్లవానిని ప్రతిసబ్జక్టులోనూ పరీక్షచేసి ప్యాసుఫేలుల పట్టికతయారు చేసికొని దానినిబట్టి టీచరుకు గ్రాంటుయిచ్చెడివారు. ఉపాధ్యాయుడు అందరిని అన్నిసబ్జక్టులలోనూ ప్యాసు చేయించుకొనుటకై మిక్కిలి శ్రమపడి పనిచేసి తన గ్రాంటును సంపాదించుకొనెడివాడు"

వారి ఉపన్యాసము ముగిసినపిదప ఆస్కూలుకు చెందిన కొంతమంది ఆడపిల్లలచే "బాలధ్రువనాటకము" బహుచక్కగా నాడబడెను. రంగస్థలము తెరలతోనే నిర్మింపబడెను. పాత్రలకు తగిన వేషములుకూడ వేయబడినవి హార్మోనియం, తబలా మిక్కిలి నేర్పుగా ఇద్దరు ఉపాధ్యాయులచే వాయింపబడినవి నాటకము పూర్తి అయిన తర్వాత పిల్లలకును, పెద్దలకును పండ్లునూ తాంబూలములునూ పంచిపెట్టబడెను

—జో॥ వెం॥

---

శ్రీయుత కాశీకృష్ణారావు బి. ఏ. గారిచే కానకగా నొసగబడిన పద్యము.

తే. గీ. నీదు విద్యాప్రబోధంబు ♦ నిర్మలంబు । నాడునాటిన విద్యయే ♦ నాణెమాయె
అస్మదీయ కృతజ్ఞత ♦ కంత మేది । శోభనీకాన్క గొనడి ♦ సుబ్బరాయ.

---

పడమరవీధి ప్రాథమిక విద్యార్థులు సమర్పించిన

## పంచరత్నములు.

(కవినాథవిలాసము)

మ. ప్రమదంబొప్పఁగ రామచంద్రవిభు పార్శ్వంబందుఁగూర్చుండి యు
త్తమభక్తుం బవనాత్మజాతుఁగని చిత్తం బుల్లసిల్లంగఁ బ్రే
మమునన్ దాధరియించినట్టి మణిదామంబొప్తిఁ బట్టాభిషే
కమునన్బిల్చి ధరాతనూజ యొసఁగెంగా దానిలో రామనా
మమునంజూడఁ గఁజీరు పావనికృపంచాలించు సుబ్రాయనిన్.

సీ. అగ్రజన్మంబున నతియుత్తమంబైన । వంశంబునం బ్రభవంబునంది
చిరకాలదేశిక స్థితివర్తనము జేసి । యుంతరపదవుల నొందిమించి
నిపనివృథగాదనినఁ బరోపకృతికి । నతులితశక్తి ముందంజవేసి
కష్టించిపనిఁచేయఁగా జాలమేలని । జగమునన్నెల్లడఁ జాటెసాటి

గీ. మిక్కిలి జగంబులను నుతికెక్కినావు । కరముగురువులలోఁ బేరుగాంచినావు
సూనులనుబోలె శిష్యులఁ జూచినావు । దోనెపూడి సుబ్బరాయమాననీయ!

ఉ. వేములవాడ భీమకవివీరుఁడు పండరికంబమున్ మహో
ద్దామ నవీనపల్లవ వితానముతో నలరారునట్లు వి
ద్యామహిమన్ రచించినటు సజ్ఞులు మొద్దులునైనవారికిన్
ప్రేమను విద్య నేర్పితివి విశ్రుతవృత్తులు వారు జెందఁగన్.

గీ. చాంద్రమానేశ్వరాబ్ద వైశాఖశుద్ధ । సప్తమిని హరిదశ్వ వాసరమునందు
భాసరనుద్యోగ విరమణమును వహించె । దోనెపూడి సుబ్బరాయమానఘనుడు.

గీ. దేశికోత్తమ సత్కళాధికులుగాఁగ । నిత్యదీవనములను మానిసువులకిడి
మీకు శతవత్సరములు సమీరసుతుని । సేవఁజేయుచునింట వసింపుఁడెపుడు.

---

## బ్రహ్మశ్రీ దోనెపూడి సుబ్బారాయుడుగారికి సహోపాధ్యాయులు సమర్పించిన పంచరత్నములు.

(కవినాథ విలాసము.)

గీ. శ్రీలఁగలుగంగఁజేయుచుఁ జిత్తశుద్ధి । నిచ్చి రక్షింప-దగు వాడు నిర్మలుండు
రామసేవకు డీ సుబ్బరాయనెపుడు । కామితార్థంబులనొసంగి కాచుగాత!

శా. నానాదేశిక వర్యసన్నుతుఁడు । నానానవ్యమార్గప్రబో
ధానందుండు పరోపకారి । జనమాన్య ప్రక్రియాసక్త వి
జ్ఞానుం డుత్తమశీలసంయుతుఁడు । ప్రజ్ఞాశాలి మఝ్ఝారె! మా
దోనేపూడి కులాబ్ధిచంద్రుఁడు । బుధస్తుత్యుండు దీర్ఘాయుఁడౌ.

క. పురపాలకసంఘముచేఁ । గరమరుదుగ నిల్పబడుటఁ గడుహృద్యంబౌ
వరపార శాలకధిపతి । స్మరణీయుఁడు తనదునుద్యమము విరమించెన్.

సీ. శీఘ్రకాలంబులో శిష్యబృందము నెల్ల । విద్యాధికులఁజేయు విబుధుఁడితఁడె
అజ్ఞానికైనఁ దాసుజ్ఞానియగుటచే । గణితబోధను జేయు ఘనుఁడితండె
అలయుపాధ్యాయు లాయాపదల్పడఁ జూచి । సహియింపజాలని సరసుడితడె
ఆయాసమనబోక నధికారిదరిజేరి । వేతనంబులవృద్ధి వేడునితడె

గీ. శ్రద్ధ సచ్ఛాత్రబృందంబు సాకునితడె । శాత్రవులు లేని ధీరుడౌ చతురుఁ డితడెఁ
వయసునను విద్యలను నెన్న పసుడితండె । అంజనానందభక్తుడై యలరు నితఁడె.

సీ. భారతీయుడనంగ ప్రౌఢత్వమునుజూప । నవతరించియు యశంబందినావు
శిష్యబృందములెల్ల శిరసావహింపఁగ । జెలరేగి సత్కృపన్ జిల్కినావు
శ్రీ యుపాధ్యక్షుల చిత్తంబు రంజిల్ల । నెనలేని మైత్రిని దనరినావు
పవనాత్మజుని పాదపంకేరుహంబుల । చిత్తంబునను జేర్చి చెలగినావు
గీ. భళిర! యీయాదరవంశాబ్ధి జలజవైరి । రాము డధ్యక్షుడై యుండ నీమముడుప
యత్నమును జేయనెంచియు యశమునించి । సుబ్బరాయుండు పదవిని నిబ్బరముగ
వీడుకోలును గావింప వేగిరపడు । నట్టివానిని హరుడును హరియు నజుడు
వేంకటేశ్వరు డెంతయు వేడ్కమీర । నాయురారోగ్యభాగ్యము లలర జేయు.

---

లక్కవరాస్థాన విద్వాంసులునూ, నాటిసభకు అధ్యక్షులునూ అయిన
శ్రీయుత కొత్తపల్లి సుందరరామయ్యగారు సమర్పించిన

# పంచ రత్నములు.

క. శ్రీదోనేపూడి కులా । హ్లాదుని శ్రీసుబ్బరాయు నధ్యక్షుఁడు దా
మోదరమోదరుఁడై । మోదుంగావించు శిష్యపుంగవులలరన్.

సీ. నాగభూషణుఁడు, కృష్ణారావు, పానకా । లారావు, నేకాంబ్రేశరావు, శేష
గిరిరావు, మాణిక్యగురురావు పుల్లాము । లాత్మ్నలై పూర్వవిద్యార్థులగుచు
గుణవృద్ధు సత్కళాగుణవృద్ధు మతివృద్ధు । శాంతవృద్ధుని గర్వసత్త్వవృద్ధు
సజ్జనవృద్ధు భాషావృద్ధు హితవృద్ధు । క్షమవయోవృద్ధు విజ్ఞానవృద్ధు
గీ. నంచితోద్యోగులగుచు నుద్యోగవిరమ । ణాభిలాషుని సుబ్బరాయాభిధాను
గురువరేణ్యుని మరువనికూర్మితోడ । గారవించినిల్పిరి పురీగౌరవంబు.

మ. ఒకచోఁదింటిమి యొక్కచోనిలిచి విద్యోపాస్తిగావించి యు
త్సుకతంగొంటిమి యొక్కవేళ సహవాసుల్మెచ్చ దాఁగూర్మి కౌ
తుక కార్యంబులగొంటి మిర్వురము మిత్రుల్బొంగఁ నర్థిమై
నొకచోనిండ్లనుగట్టుకొంటి మొకచోనుత్సాహముం జెందగన్.

క. పుట్టినయూరెఱుంగఁడు తా । మెట్టిన హేలాపురంబె మేటిగనెంచెం
దిట్టుటకొట్టుట బాలుర । పట్టునసే సుబ్బరాయవర్యుఁడెరుగునే!
గీ. గురువరోద్యోగమును మానుకొనినఁగాని । సుబ్బరాయఁడు తీరికజూపియింట
గూరుచుండియు మనపుత్రకోటికింకఁ । జదువుచెప్పెడుశక్తి యీశ్వరుఁడొసంగు.

---

# గ్రామపారిశుధ్యము - గ్రామోపాధ్యాయుడు.

(Village Sanitation and the village teacher)

(ఆకెళ్ళ సీతారామము గారిచే)

సంపూర్ణ సౌఖ్యమును, యశఃసంపదను బొందుటకు మానవుడు తొలుత శరీరదార్ఢ్యము నందవలెను. దేహారోగ్యము చేకూరినగాని మనుజునకు మనస్స్థిమితముండదు. అందువలన నాతడే కార్యమును జేయజాలడు. 'శరీరమాద్యంఖలు ధర్మసాధన'మ్మను నార్యోక్తి ననుసరించి పరోపకార పరాయణుడగుటకు మానవుడు దృఢశరీరుడైనగాని ప్రయోజనముండదు. ఎంతభాగ్యమున్నను, విమలవిజ్ఞానమున్నను, రాజ్యవైభవములున్నను, మానవునియొడలు చెడి యారోగ్యమలవడనిచో జీవితము దుఃఖభాజనమగును. కాన మానవు లారోగ్య వంతులగుటకు దురభ్యాసములకు లోనుగాక బాల్యమునుండియు జాగరూకతతో మెలంగవలయును. తల్లిదండ్రులును బాలురయారోగ్యవిషయమై నెక్కుడు శ్రద్ధవహింపనగును. కొందఱుబాలురు విద్యాభ్యాసోత్సాహులై పాఠశాలలో బ్రవేశింతురు. అట్టివారిని విద్యాభ్యాసమెందుకని యడిగిన ధనసంపాదనమునకనియు, నుద్యోగసంపాదనమునకనియు, వాక్రుత్తురు.

కాని విద్యమానవునకు కొంతవఱకు తోడ్పడినను, భాగ్యములన్నింట నారోగ్యభాగ్యమే మొదటిదను ముఖ్యాంశమును యుపాధ్యాయుడు బాలుర మనస్సులకు నాటంపవలెను. దేశసౌభాగ్యమున కుపాధ్యాయుడే పునాదివంటివాడనియు (Teachers are the builders of the Nation) నట్టి దేశసౌభాగ్యము తనచెంతకు విద్యనభ్యసింపవచ్చిన భావిపౌరులగు బాలురపై నాధారపడుటచే వారిసర్వవిధములగు నభివృద్ధుల కన్నివిధముల దోడ్పడుభారము తనపైనున్నదని యాతడు విశ్వసింపనగును. సేవాతత్పరత, ఓర్పు, శాంతి, సర్వ సమత్వము, సత్ప్రవర్తనము, స్వాతంత్ర్యశక్తి మొదలగు సద్గుణములుగల యుపాధ్యాయుడు, చిరుత ప్రాయముననే దన కధీనముగావింపబడిన బాలుర భావిసౌఖ్యమునకును, శరీరారోగ్యమునకును, బుద్ధివికాసమునకును, స్వతంత్రకార్య నిర్వాహత్వమునకును ననువగు విద్యనిచ్చి గౌరవప్రపత్తుల బడయనగును. 'A sound mind in a sound body' అను నాంగ్లోక్తి ననుసరించి శరీరదార్ఢ్యము సెంపొందు కొలదిని బుద్ధివికాసముగూడ నగునుగాన నుపాధ్యాయుడు బాలురకనువగు నాటలను, వ్యాయామ క్రీడలను గఱపుచు నాయాగ్రామములందుండిన పూర్వుల యాత్మకృష్ట్య ధర్మములను, వారి శరీర పటుత్వాదికములను చెప్పుచు, వానికి దగినకారణములను బాలురకు సుబోధకములగునట్లు గ్రామచరిత్రాదికములను జెప్పుచుండవలయును. దురభ్యాసముల బాల్పడకుండుటకు నారోగ్యసూత్రములు మొదలగువానిని బోధింపనగును. బాలుర మనోవికాసమునకు బడియందుపాధ్యాయుడిచ్చు క్రిమబోధనములే గాక వారుతిను నాహారపదార్థములు, నివసించుగృహములు, మసలెడి తావులు మొదలగు విషయములగూడ నుపాధ్యాయుడు గమనింపనవసరము.

పైని జెప్పబడిన విధమున బాలుర విద్యాభివృద్ధికిని, శరీరావయవ సౌష్ఠవనిర్మాణవిషయమునకును జాగ్రత్తవహించి నంతమాత్రమున దన విధికృత్యము (duty) నెఱవేఱినదని తలంపక, తన్నొకసంఘ సేవకునిగ భావించి తానువసించు గ్రామముయొక్కయు, నందువసించు ప్రజలయొక్కయు నన్నతికి బాటుపడుటకు సర్వవిధముల బ్రయత్నింపవలయును. "పరోపకారార్థమిదంశరీర"మ్మను నార్యోక్తి నెఱింగి, నేనేవిధముగ దేశమున కుపకరింతునను తలంపుతోనుండి తన యోపినంతవఱకు జనుల సౌఖ్యకరకార్యములకు దోడ్పడవలయును.

హిందూదేశమున ప్రతివత్సరమును మృతినొందుజనసంఖ్య నితరదేశములతో సరిపోల్చి చూచిన మిక్కిలి యెక్కువగ నున్నట్లును, దానికి దేశమందు వ్యాపించు నంటువ్యాధులు, జ్వరములు, ప్రజలలోని చెడ్డయలవాట్లును గారణములని వేనోళ్లను వినుచుందుము. చలిజ్వరము, కలరా, విషూచి, ప్లేగు, కుష్ఠు మొదలగు విషమవ్యాధులజనింపజేయు సూక్ష్మజీవులు జన్మించుట కనువగు మార్గములుండుటచే నభివృద్ధి పొంది జనులలో నీరోగముల గల్గించి దేశనాశనకరములగుచున్నవి. సాధారణముగాని నిట్టివ్యాధులు జనింపజేయు సూక్ష్మజీవుల కీగ్రామములే కారణభూతములన్నమాట నిర్వివాదాంశము పల్లెలలో నిండ్లవాఱు ప్రసారమునకును, సూర్యరశ్మికిని తావివ్వక గవాక్షరహితములై, దుస్సహదుర్గంధపూరితంబును, గోమలమూత్రాది సంయుతమును నగు పశుశాలలతోను, మఱికి గోతులు, పెంటకుప్పలు, తూము కాలువలు మొదలగు వానిచేతను నావరింపబడి కలరా, మశూచికము, ప్లేగుమొదలగు వ్యాధుల గలుగజేయు క్రిమికీటకాదులు నిరాటంకముగ వ్యాపించుట కనుకూలములైయుండును. మహామారి యను విషమవ్యాధినిజనింప జేయు నెలుకలు స్వేచ్ఛగ గృహములందు వాసముచేయుట కనువగు నట్లింటి సామానులను, ధాన్యము మున్నగు నాహార పదార్థములను నజాగ్రత్తగనుంచి ఎలుకలభివృద్ధి నొందు పెంటకుప్పల పెరళ్లలో నిలువయుంచి కొఱివితో దలగోకికొన్నట్లు గ్రామస్థులలో ఒక్కండ్రు లేనివ్యాధులను స్వయముగ తామే యాహ్వానింతురని జెప్పనగును. మఱియును ప్రజల సామాన్యారోగ్య సూత్రముల గమనింపక, సంఘమునకు, తమకును, తమయిరుగు పొరుగున కాపురముండు వారియెడలను తమకుండు బాధ్యతను గుర్తింపలేక, తమయింటనరిష్ట పదార్థములున్న నితరుల కేమినష్టమను నవివేకతకు బాల్పడి, తామొనరించు యకార్యముల ఫలమగు వ్యాధుల దామనుభవించుటేగాక తక్కినవారినిగూడ నట్టి విషమవ్యాధుల వాతదోయు వారగుచున్నారు.

అర్థబలమున, అంగబలమున, బుద్ధిబలమునవిది యది యననేల సర్వవిధముల వెనుకబడి యంధకారబంధురమున మునిగియున్న మాలవాండ్ర తాము నివసించు గుడిసెల నెముకలతట్టలతోను, పశువుల ప్రేవులతోను యపక్వ[illegible] తోళ్లతోను నింపి యపరిశుభ్రములుగను, దునారోగ్యవంతములుగను జేసివ్యాధి జనితములగు సూక్ష్మజీవులుద్భవించుట కన్నివిధముల దోడ్పడుచున్నారు. దుర్గంధపూరితమగు గాలిచే నావరింపబడు వారి గృహ సామీప్యముల సంచరించుట దుస్తరము.

కావలసినన్ని పాయఖానాలు గ్రామములలో లేనందున గ్రామస్థులు, గ్రామ పరిసరములందుండిన పొలములలోను, చెరువుల సమీపముననను, కాలువగట్లపైనను, మలవిసర్జనము గావింతురు. అమేధ్యమువలన నేల పాడగుటచే గ్రామ పారిశుధ్యమునకు భంగముకలుగును. మరియు మలవిసర్జన ప్రదేశములుచెడి యందు రోగజనితములగు జీవులు జనించును. వాటివలన గలుగు

కొంకి పురుగువ్యాధి మున్నగువ్యాధులకు బాల్పడిన ప్రజలొకరినుండి మఱియొకరారోగ్యమునకు గురియగుదురు. గ్రామపారిశుధ్ధ్యమునకై శ్రద్ధబూను వారెవ్వరును లేనందున ప్రజలు వీధులను, సందులను దమయిష్టమువచ్చిన చందమున పాడుచేతురు. వీధులలో గుంటల నేర్పరుచుటవలన నిలువ నీటికిరవై యందుండి చలిజ్వరము మొదలగువ్యాధుల గలుగజేయు దోమలను, పెంటప్రోవులు, చెత్త మొదలగు వాటిని మార్గముల బడవైచుటచే తదితరరోగ జనిత జీవులు బుట్టుట కవకాశ మిత్తురు.

గ్రామస్థులు తమగ్రామముల చేరువనున్న చెఱువులయందలి నీటిని, సమీప నూతుల యందలి నీటిని త్రాగుట కుపయోగింతురు. వారు త్రాగుట కుపయోగించు చెఱువులు వీధి కాలువలనుండి తేబడిన చెత్త మొదలగువాటి చేతను, బట్టలు మొదలగు వాటి నుదుకుటచే నేర్పడిన మురికిచేతను, పశువుల గడుగుటచేతను నపరిశుభ్రములై, రోగజనిత క్రిమిసంకీర్ణములై యుండును. ప్రజలానీటినే త్రాగుటకుపయోగించి తదుష్ఫలముల శీఘ్రకాలముననే బొందుదురు. వేసవియందు నీరెండినపిదప ప్రజలా చెఱువులనే పాయఖానాలక్రింద నుపయోగించి వర్షకాలము వచ్చినపిదప నందలినీటిని ద్రాగి రోగగ్రస్తులగుదురు.

పైనుదహరించిన వివిధములగు దురభ్యాసముల వలనను యారోగ్య మార్గోల్లంఘనవలనను ఘోరమగు వ్యాధులకు బాల్పడు గ్రామస్థులకు సర్కారువా రారోగ్య శాఖాధికారుల నియమించియు, ప్రజాసౌకర్యముల గలిగించియు, నింకననేకవిధముల దోడ్పడి దేశములో వ్యాపించు నంటువ్యాధుల నశింపజేసి ప్రజలరోగవిముక్తుల జేయ యత్నించు చున్నను, దేశసేవకులలో నొకడుగ నెంచబడు గ్రామోపాధ్యాయుడు కూడ శక్తివంచనలేక గ్రామ పారిశుధ్యమునకై పాటుపడుట మిక్కిలి యవసరము. మన దేహ మారోగ్యవంతముగ నుండుటకు మనము నివసించు దేహముకూడపరిశుభ్రముగను, యారోగ్యవంతముగను నుండవలయు ననియు, వెలుతురు ప్రవేశింపనియింట వైద్యుడు ప్రవేశించు ననియు, నాహేతువుచే తాము వసించు గృహములు వాయువును, వెలుతురును ప్రసరించుట కనువగు గవాక్షము లను ద్వారములను గలిగి యుండవలె ననియు నుపాధ్యాయుడు పురజనులను హెచ్చరింప వలయును. మఱియు మురికిగోతులు, పెంట ప్రోవులు మొదలగునవి తమ యిండ్ల సామీప్యమున నుండనీయకుండ నట్లు జూచుకొన వలయు ననియు, సర్వవిధముల తమ గృహములు తమకు వాసయోగ్యములై యుండునవిగ జేయుటకు ప్రోత్సహింపనగును. వీధులయందును సందుగొందుల యందును. మలమూత్ర విసర్జన గావింపకుండుటకై గ్రామోద్యోగులతో జెప్పి తగిన యేర్పాటులజేసి గ్రామస్థులను విషమ వ్యాధి పీడితులనుగ జేయకుండుట కుపాధ్యాయుడు యత్నింప నగును. మలవిసర్జనకిబ్బందిగలుగుచున్నదనితోచినచో నుపాధ్యాయు డారోగ్య శాఖాధికారులతో నేదేని పాయఖానాను గట్టించుటకో లేక ప్రజాక్షేమమున కనువగు తదితరోపాయములను జూపింప మనుటకో గ్రామపెద్దలతో గూడి ముచ్చటించి వారికి తోడ్పడుట యుచితమగును కాని ప్రజలు వీధుల నేహ్యపరచుట కొప్పుకొనక యట్లొనర్చినవారికి యుక్తమనితోచిన శిక్షాపాత్రులనుగ కూడ జేయ నుద్యమింపవచ్చును చెఱువులలోని నూతులలోని నీరు చెడినచో దత్కాలమున గ్రామమునకలవడు నష్టముల స్పష్టగతిని ప్రజలహృదయముల హత్తింపవచ్చును. దొడ్లయందును, పశుశాలల సమీ

పమునను ముఱికినీటిగుంటలు లేకుండునట్లు జాగ్రత్తపడనిచో గ్రామానర్థము స్వల్ప కాలముననే చేకూరునని ప్రజలకెఱుక పఱుప నగును.

నిలువనీరు, పెంటప్రోవులు, మలవిసర్జనము వలన చెడిన నేలలు మున్నగువాటివలన సంభవించెడి రోగములును, నట్టిరోగముల వాతబడి దుర్భరదుఃఖముల ననుభవించు రోగులను జూర్చి వీలగునప్పు డుపాధ్యాయుడు ప్రజాబృందముల కుపన్యసింపవచ్చును. ముఖ్యముగాన నారోగ్యవంతులును, దుర్భర దేహులును నగు మాలవాండ్ర విషయమై తగిన జాగరూకత బూని వారినిగూడ నభివృద్ధికి దీసకొనివచ్చుటకు బ్రయత్నింపనగును. వీలగునప్పు డుపాధ్యాయుడు సమీపపట్టణములందుండు యారోగ్య శాఖాధికారుల వద్దనుండు పటప్రదర్శన యంత్రములను, చిత్తరువులనుదెచ్చి ప్రజలకు కలరా, విషూచి ప్లేగు మొదలగు పెనువ్యాధులకు బాల్పడి యిక్కట్టుల పాలగువారియొక్క ఛాయాచిత్రములజూపి విరివిగ నుపదేశించి కృతార్థుడగును. సమర్థుడును, చతురుడునగు నుపాధ్యాయుడప్పుడప్పుడు పట్టణములలో నొక వైద్యుని దోడ్కొనివచ్చి యతనిచే నారోగ్యోపన్యాసముల నిప్పించి ప్రజలకన్నింటికంటె నారోగ్యముయొక్క యావశ్యకతను మనస్సుల కెక్కింపవచ్చును. సమీపగ్రామములందుగాని, తనగ్రామమందుగాని నేదేని యంటువ్యాధి వ్యాపించినచో విద్యాధికుడగు నుపాధ్యాయుడు ప్రజాహితార్థమై యారోగ్య శాఖాధికారుల కాసంగతిని దెలియబఱచితగిన జాగ్రత్తల దీసికొన యత్నింపనగును. రోగములు ప్రబలముగ వ్యాపించు దినములలో ప్రజలు జాగరూకత గలిగి, మితభోజనమును, శుభ్రమగునీటిని త్రాగి వర్తించునటుల జేయవచ్చును. నిత్యకృత్యము లందుగూడ నారోగ్యదాయకములగు మార్గముల దానువర్తించుచు ప్రజల కాదర్శకుడు గను, మార్గదర్శకుడుగను నుండి వారి యాదరణమును గౌరవమును బడయనగును.

వేయేల! ఎవ్విధముననను మాలిన్యమే సర్వవిధములగు వ్యాధులకును హేతుభూతమనియు, నిట్టిమాలిన్యమును భుజించు పదార్థములందును, త్రాగునీటియందును, కట్టుబట్టల యందును, వసించు గృహములందును, చేయుకార్యములందును, నూహించు నూహలయందును ప్రవేశింపజేసినకతన గలుగు ఫలమధోగతియే యని ప్రతిపౌరుని హృదయక్షేత్రమునందును నాటి, తనగ్రామమునకు పారిశుధ్యమును జేకూర్చి, దేశసేవాగ్రగణ్యులలో నొక్కడై ప్రజలచే నాదరమును, ప్రజాపరిపాలకులచే కృతజ్ఞతను బడసి యుపాధ్యాయుడు నిరతరముగు మేలందుగాక!

# స్కూలుబోర్డులు.

28 వ చెన్నరాష్ట్రవిద్యావిషయిక సభలో యస్. ఇ. రామానుజ అయ్యంగారు రాష్ట్రములోని ప్రాథమికవిద్యయెంతహీనస్థితిలో ఉన్నదో చెప్పుచూ S I T U వారు దానిని సరియైన దారిని పెట్టవలచి తయారు చేసినస్కీమును సభలో చదివి వినిపించినారు. అది ఏకగ్రీవముగా నామోదింపబడినది. దానిలో ఒక భాగము మాత్రము ఈదిగువ వ్రాయబడినది.—

ప్రతియూరను ఎలిమెంటరీ ఎడ్యుకేషనుకు చెందిన పాఠశాలలు ఒక "స్కూలుబోర్డు" యొక్క పరిపాలనలో నుండవలెను. చిన్నగ్రామములైన యెడల కొన్నిగ్రామములకు కలిసి ఒకటియే చాలును. విద్యాసంస్థలకు చెందిన కొందరునూ, తల్లిదండ్రుల సంఘముల తరఫున కొందరునూ, స్కూళ్ళ మేనేజర్లునూ, స్కూలుబోర్డు ఫండుకు ఏడాదికేబదిరూపాయలకు మించిన చందా నిచ్చెడివారునూ సభ్యులుగ నుండవలెను.

స్కూలు బోర్డుఫండు ఈక్రింది విధములుగా సమకూడవలెను. (1) ఎడ్యుకేషను సెస్సు (2) గవర్నమెంటు కంట్రిబ్యూషను (3) స్థానికసంస్థల కంట్రిబ్యూషను (4) తల్లిదండ్రులకు విధించు పెనాలిటీలు, ఫైనులు (5) కోఆపరేటివ్ సొసైటీలకామన్‌గుడ్ ఫండు (6) పౌరులవల్లవచ్చుధర్మములు (7) స్కూళ్ళనుండి వసూలుచేసే రికగ్నిషనుఫీజు (ఆస్తులనుబట్టి తప్పనిసరిగా ఎడ్యుకేషను సెస్సును ఊరిలో వసూలుచేసి అంత సొమ్మును వేరే గవర్నమెంటువారి కంట్రిబ్యూషనుగా తీసికొనవలెను.)

ఎలిమెంటరీస్కూళ్లు పబ్లిక్ మేనేజిమెంటయినను ప్రయివేటు మేనేజిమెంటు అయిననూ యీస్కూలుబోర్డు కంట్రోలులో ఉండీ తీరవలెను. ప్రతిస్కూలుబోర్డు క్రిందనూ అధమము ఒకచిన్న పిల్లలబడి ఒక ఎడల్టుస్కూలు ఉండితీరవలెను.

ఈక్రింది ఏర్పాటులతో నిర్బంధ విద్యను ప్రతిచోటను 5 సంవత్సరములలో అమలులోనికి తేవలెను.—స్కూలు బిల్డింగునకునూ, టీచర్లు నివాసముండుటకు గృహములకును ప్రత్యేకపు ఏర్పాట్లుండవలెను. స్కూలుకు కావలసినసాధన సామాగ్రి పూర్తిగా నుండవలెను. స్కూలులో పిల్లలను ప్రవేశపెట్టు బాధ్యతయు, ప్రవేశపెట్టిన తర్వాత ప్రయిమరీ పూర్తి అయ్యేవరకు మానకుండ చూచు బాధ్యతయు, తల్లిదండ్రులదే కాని, ఉపాధ్యాయులకిట్టి బాధ్యత యుండరాదు. వ్యాధిగ్రస్తుడైనప్పుడు తప్ప పిల్లవాడు హాజరుకాక పోయిన తల్లిదండ్రులకు ఒకపెనాల్టీవిధింపవలెను.

ఎలిమెంటరీ ఎడ్యుకేషను 5 ఏండ్ల కోర్సుగా నుండవలెను. మాతృభాషలో వాడుక లెక్కలు నేచరుస్టడీ, అచ్చట వాడుకలోనున్న పరిశ్రమలు హిష్టరీ, జాగ్రఫీ, ఫిజికల్‌ట్రయినింగు, తోటపని, నూలువడకట, నీతిపాఠములు బోధచేయవలెను. అవసరమైన అచ్చుపుస్తకములు, నోటుపుస్తకములు యింకా యితర పరికరములూ స్కూలు మేనేజిమెంటువారుగాని, 'స్కూలుబోర్డు' వారుగాని ఉచితముగా సప్లయి చేయవలెను. వాగే మధ్యాహ్నపు భోజనపర్పాట్లనుకూడ చేయవలెను. 12 సంవత్సరములు దాటిన పిల్లలు ఈ ఎలిమెంటరీ స్కూళ్ళలో నుండరాదు.

'స్కూలుబోర్డు' ఈక్రిందిపనులను చేయుచుండవలెను.-నిర్బంధ విధానమును అమలులో

పెట్టుట, స్కూళ్లకు రికగ్నిషను గ్రాంటు చేయుట, స్కూలులో తగిన విశాలముండున ట్లునూ, కావలసిన పరికరములుండునట్లునూ చూచుట, మధ్యాహ్నపు భోజన ఏర్పాట్లను చేయుట, లైబ్రరీని సాగించుట ఒక మ్యూజియమునూ రీడింగు రూమును నెలకొల్పుట.

రికగ్నిషను గ్రాంటుచేయునప్పుడు 'స్కూలు బోర్డు' ఈక్రింది సంగతులను గమనించవలెను - క్లాసుకు రు 10-0-0 చొప్పున ఫీజు ప్రతిస్కూలును బోర్డుకు చెల్లించవలెను. స్కూలుకు సరియైన ప్రత్యేక బిల్డింగునూ టీచర్లకు సరియైన ప్రత్యేక బసలునూ ఉన్నవో లేవో చూడవలెను. స్కూలుకు కావలసిన పరికరములున్నవో లేవో చూడవలెను. క్వాలిఫైడ్ టీచర్లు ఉన్నదీ లేనిదీ చూడవలెను. టీచర్లకు జీతములు స్టాండర్డు రేటు ప్రకారమున్నూ, సకాలమునకున్నూ యివ్వబడుచున్నవో లేవో చూడవలెను. ఎడ్యుకేషను డిపార్టుమెంటువారి నిబంధనల ప్రకారము స్కూలు జరుగుచున్నదో లేదో చూడవలెను.

—జో॥ వెం॥

---

G. O No 2611 Dated 8-12-'36

# ప్రాథమిక విద్యావిధానమందు మార్పులు.

దొరతనమువారు కొంతకాలమునుండి ప్రాథమికవిద్య మన చెన్నరాజధానిలో ఎట్లు సాగుచున్నదీ కడుశ్రద్ధతో పరిశీలన చేయుచున్నారు. అట్టిపరిశీలనానంతరము తేలిన సారాంశము ఏమనగా - ఎలిమెంటరీ స్కూళ్ళలో చాలా భాగము దుర్వ్యయము, నిష్ఫలము, అనవసరము (uneconomical, ineffective, superfluous) గానున్నవని. ప్రాథమిక విద్యయొక్క ఉద్దేశ్యము ప్రజలలో శాశ్వతముగ 'విద్యరానితనము' ను పోగొట్టుట గాన అట్లుచేయలేకుండనున్న పాఠశాలలు నిష్ఫలమనియు, వాటికై యిచ్చిన గ్రాంటులు దుర్వ్యయమనియు, ఒకే చోటనే చాలా పాఠశాలలు పోటీలమీద స్థాపింపబడి ఏఒక్కదానిలోనూ తృప్తికరమైన పిల్లలసంఖ్య లేకుండుటచే అట్టివి అనవసరమనియూ గవర్నమెంటువారి యభిప్రాయము.

| | |
|---|---|
| చెన్నరాజధానిలోని లోయర్ ఎలిమెంటరీ స్కూళ్ళసంఖ్య | 42,600 |
| పూర్తిగా 5 తరగతులున్న స్కూళ్ళు | 7,160 |
| పూర్తిగా 3 తరగతులుమాత్రమున్నవి | 8,300 |
| ఒకే ఉపాధ్యాయుడున్న స్కూళ్లసంఖ్య | 18,6[illegible]0 |
| మొత్తముమీద 30 మందిపిల్లలకు తక్కువగానున్న స్కూళ్ళు | 12,000 |

1931 సం॥లో 1వ తరగతిలో చదువుచున్న 11,65,000 పిల్లలలో 1932 సం॥లో 2వ తరగతిలోనిలిచిన వారిసంఖ్య 4,65,000 మాత్రమే. 1935 సం॥లో 5 వ తరగతి వరకు నిలిచినవారి సంఖ్య 1,01,000 మాత్రమే. మొత్తము 5 తరగతులలోను వయసు ముదిరిన పిల్లల సంఖ్య 5,0[illegible],000.

పై కారణములవల్ల గవర్నమెంటువారు ఈక్రింది విధముగా కొన్ని మార్పులను చేసియున్నారు.—

(1) పూర్తిగా 5 తరగతులున్న ప్రయిమరీస్కూళ్ళకే విరివిగా గ్రాంటులుగాని, సబ్సిడీలు గాని యిచ్చుట.

(2) సగటున 25 మందికన్న తక్కువ పిల్లలుగల స్కూళ్ళకు అసలే సహాయముచేయకుండుట.

(3) 5 తరగతులున్నస్కూళ్ళలో 4, 5 తరగతులలో సరియైన బాలురసంఖ్య లేనియెడల గ్రాంటును తగ్గించుట.

(4) చాలా మట్టుకు ట్రయినింగు పొందిన టీచర్లు ప్రతి స్కూలు నందును ఉండునట్లుచేయుట.

(5) ప్రతి హైయరు ఎలిమెంటరీ ట్రెయిన్డు టీచరుకు ఇచ్చుచున్న 12 రూపాయలగ్రాంటును 14 రూపాయలు చేయుట.

(6) ప్రతి శెకండరీగ్రేడు ట్రెయిన్డు టీచరుకు యిచ్చుచున్న రు 16-10-0 గ్రాంటును 18 రూపాయలు చేయుట.

(7) ప్రాథమికవిద్యను సరియైనదారిని పెట్టుటకు ప్రస్తుతమున్న విద్యాశాఖాధికారుల సంఖ్య చాలదుకాబట్టి 4 గురు డివిజనల్ ఇన్స్పెక్టర్లనూ 79 గురు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్లనూ 5 గురు సబ్ అసిస్టెంటు ఇన్‌స్పెక్టర్లనూ క్రొత్తగా వేయుట.

—జో॥ వెం॥

# నల్లబల్ల.

స్కూలులో మాష్టరు కంటె ఎక్కువబాగా బోధచేయగల వస్తువేది? నల్లబల్ల. నల్లబల్ల ఏరంగులోనుండవలెను? నల్లగానేగా! మీస్కూలులోని నల్లబల్ల నిజముగా నల్లగానున్నదా?

నల్లబల్ల నల్లగాలేకపోతే మాష్టరు ఏం చెయ్యాలి? బల్లను నలుపు చేయించవలసినది స్కూలుమేనేజిమెంటుకు అర్జీపెట్టుకోవాలి. ఇటువంటి అర్జీలు మంజూరు కావడానికి పట్టే రెండు మూడు సంవత్సరాల్లో మేష్టర్లు ఏమిటిచెయ్యడం? ఏమీచెయ్యకుండా ఊరకోకూడదు. ఊరుకోక చెయ్యవలసిందేమిటి?

(1) మేష్టారికి నల్లకోటుంటే దానిని స్కూలుకి రాగానేవిప్పి గోడకి కొంచెంపీలుగా తగిలించి సుద్దముక్కతో మామూలు ప్రకారం వ్రాస్తూ వుంటేసరి. ఒకవేళ మేష్టారికి కోటంటూ ఒకటి లేకపోయినా, ఉండి దాని నీమోస్తరుగా ఉపయోగించిన మీదట చిరిగిపోవుట తటస్థించినా,

(2) మరీ లేతవయస్సుకాని ఒకళ్లిద్దరు నల్లరంగు పిల్లల్ని ఏరి, వాళ్లని కుర్చీవద్దకురమ్మని, వచ్చిన తర్వాత వెనుకకు తిరుగమని, తిరిగిన తర్వాత వాళ్ల వీపుమీద ఆ ట్టే గ ట్టి గా నొక్కకుండా సుద్దముక్కతో వ్రాస్తేసరి. ఈ పద్ధతి బాగానేఉందికాని, పాపం ఆ ఒకళ్లిద్దరు పిల్లలికి చదువుపోదా? చదువుపోతుందని అనుమానించ నక్కర్లేదు. ఆవ్రాసింది చెరపకుండా యింటికి పంపిస్తేసరి. అక్కడవాళ్ల వాళ్లచేతగాని, స్నేహితులచేతగాని వీపుమీదనున్నది చదివించుకొని పుస్తకంమీదఎక్కించుగుంటారు. ఒకవేళ అటువంటి మరీ నల్లరంగు పిల్లలు దొరక్కపోయినా, దొరికి వాళ్లపనికి ఒప్పుకోకపోయినా, ఈపనికి ఒప్పుకొన్న పిల్లలు తీరా యింటికి పోయేటప్పటికి తల్లిదండ్రులవల్ల ఆకుర్ర వాళ్లకీ మాష్టరికీ కూడ చివాట్లువచ్చినా,

(3) ప్రతి స్కూలులోనూ ఉన్న ఫర్నిచరు సామాన్యముగా పాడైపోయే వుంటుంది గనుక దానిలో మరీబాగా పాడైనతాలూకు కొన్ని కర్రముక్కలను పోగుచేసి, వాటిని చక్కగా పేర్చి, కుర్రవాళ్ల వద్దకాని మేష్టరు వద్దకాని అగ్గిపెట్టె దొరికితే సరేసరి లేకపోతే కొంచెము నిప్పును ఎవరింటి వద్దనించైనా తెప్పించి ఆకర్రముక్కలను అంటిచి, బాగామండనిచ్చిన పిదపనీళ్లుపోసి ఆరిపి, ఆవచ్చిన నల్లబొగ్గుతో తెల్లనైపోయిన నల్లబల్లమీద వ్రాస్తూఉంటేసరి.

ఢం! ఢం! ఢం!

# శ్రీ ఆఱవ జార్జి చక్రవర్తి.

### కుటుంబము.

శ్రీ ఆఱవజార్జి చక్రవర్తిని చిన్నతనమున ఆల్బర్టు అనిపిలిచెడివారు. వీరి తండ్రియైన పంచమజార్జి చక్రవర్తిగారికి నలుగురు కుమారులునూ ఒకకుమార్తెయునూ సంతానము. కుమారులలో మొదటిఆయన ఎడ్వర్డు (ఇప్పుడు డ్యూక్ ఆఫ్ విండ్సర్), రెండవఆయన ఆల్బర్టు (ఇప్పుడు 6 వ జార్జిచక్రవర్తి), మూడవ ఆయన హెన్రీ (ఇప్పుడు డ్యూక్ ఆఫ్ గ్లస్టర్), నాల్గవ ఆయన జార్జి (ఇప్పుడు డ్యూక్ ఆఫ్ కెంట్). వీరి సోదరిపేరు మేరీ.

### చిన్నతనము.

ఆల్బర్టు 14 డిశెంబరు 1895 న పుట్టెను. అన్నగారీయనకన్న 1 సంవత్సరముపైన కొన్ని నెలలు పెద్దవాడు, మేరీ 16 నెలలుచిన్నది. వీరు ముగ్గురును చిన్నప్పుడు కలిసి ఆడుకొనుచుండెడివారు వీరి ముువ్వురిలోనూ ఆల్బర్టు ఎక్కువ బిడియముకలవాడు క్రొత్తవారెవరైన వారియింటికి వచ్చినప్పుడు యీయన సిగ్గుచే మాట్లాడెడివాడుకాడు. బిడియమునకు తోడు, శరీరము అతినాజూకుగనుండెడిది కాని యీయనకు చిన్నతనమునుండియు పట్టుదల, కార్యదీక్ష ఎక్కువగనుండెడివి. బిడియమును, నాజూకుతనమునూ పోగొట్టుకొనుటకీయన చేసిన కృషిఅపారము. చేతిపనులన్న యీయనకు చాలా సరదాగానుండెడిది. వాటి మూలమునను, గుఱ్ఱపుస్వారి, ఈతయీదుట, క్రికెట్టు టెన్నిసు మొదలైన యాటలనాడుట వలననూ యీయన త్వరితములో దేహదార్ఢ్యమును సంపాదించుటయేగాక మీటింగులలో సహితము ధైర్యముగా మాట్లాడుటలవడెను.

### వ్యాపకములు.

తనకు ప్రత్యేకముగా ఒక కార్ఖానాను నిర్మించుకొని తీరుబాటుగానున్న సమయములలో అక్కడికిపోయి పనిచేయుచుండెడివాడు. వారియింటిలో విద్యుద్దీపములు వెలిగించుటకాధారమైన ఇంజనును తానేస్వయముగా నడుపుచుండెడివాడు. టెన్నిసులో పోటీపందెములలో సహితము పాల్గొన గలిగినంత సమర్థతయుండెడిది. తనకు ప్రత్యేకముగా ఒక పడవయుండెడిది. దానిని తెడ్లతో బహునేర్పుగా తోయుచుండెడివాడు. 14 వ ఏట నావికాదళములో ప్రవేశించి తనకు 18 వ సంవత్సరము వచ్చువరకునూ సామాన్య నావికోద్యోగిగానుండి నావికా సంబంధమైన అన్ని విషయములుపూర్తిగ నేర్చుకొనెను. కానితాను నేర్చినదంతయుఐరోపా మహాసంగ్రామమున ఆ చరణలో పెట్టుటకు చాలా ఆటంకములు వచ్చినవి. యుద్ధము ప్రారంభింపకమునుపే ఒట్టావాలోనుండగా జబ్బుపడి, ఆ తరువాత నాలుగు మారులు అట్టి అస్వస్థత రాగా ఎంతయో అయిష్టముతో సముద్రయానమునుండి తన మనమును మరల్చుకొనవలసి వచ్చెను. తిరిగి ఆయన 1918 సం॥ లో విమానదళములో జేరెను. పరిశ్రామిక యంత్రములన్నిటితోనూ బాగుగా పరిచయము చేసికొనుటయేగాక ఫ్యాక్టరీలలో పనిచేయు కూలివాండ్ర యోగక్షేమముల నరయుచుండెడివాడు. హిస్టరీ, ఎకనామిక్సు, సివిక్సు తన [illegible]గా

తీసికొని కేంబ్రిడ్జిలోని ట్రినిటీ కాలేజీలో యూనివర్సిటీ విద్యను కూడ నభ్యసించెను.

వివాహము.

1920 వ సంవత్సరములో నీయనను డ్యూక్ ఆఫ్‌యార్కుగా చేసిరి. స్కాట్‌లండ్ రాజ కుటుంబమునకు చెందినట్టియు, చాలా సాంప్రదాయసిద్ధమైన వంశములోనివాడును అయిన ఎరల్ ఆఫ్ స్ట్రాత్ మోర్‌గారి కుమార్తె ఎలిజబెత్ బవీస్‌లియాన్ అను నామెను ఆయన 26 ఏప్రిల్ 1923 సం॥ న పెండ్లియాడెను. స్ట్రాత్ మోర్‌గారి నలుగురు కుమారులునూ ఐరోపా మహాసంగ్రామములో పాల్గొనియున్నారు. వారి స్వగృహమైన గ్లామిస్ కాజిల్ యుద్ధకాలములో గాయపడిన వారి నిమిత్తము ఒక చికిత్సాలయముగ మార్చి వేయబడెను. ఈ చికిత్సాలయమునకు తేబడిన వారికి ఎలిజబెత్ (తన చదువును మానుకొని) స్వయముగ చికిత్సచేసి ఆదరించి యుండెను.

ఈమెకు 1926 సం॥ న ఎలిజబెత్‌ను, 1930 సం॥న మార్గరెట్ రోజ్‌ను అనుఇద్దరుకుమార్తెలు కలిగిరి. పెద్దపిల్లయైన ఎలిజబెత్‌కు తల్లియే స్వయముగాచదువునేర్పెను ఆపిల్ల 6వ ఏటనే అర్థజ్ఞానముతోనూ చురుకుగానూ చిన్న చిన్న ఇంగ్లీషు పుస్తకములను చదువ గలిగి యుండెను. ఈమె ఇప్పుడు చక్కగా ఈతను కూడ నేర్చినది. తాతగారు బహుమతిగా నిచ్చిన షెట్లండు పోనీమీద స్వారి చేయుచుండును. బాగుగా విద్య నభ్యసించుచున్నది. మార్గరెట్టు రోజ్‌నకు సంగీతములో యెక్కువ యిష్టము.

రాజ్యము.

అన్నగారైన ఎనిమిదవ ఎడ్వర్డు రాజ్యమును వదలుకొనగానే పెద్దతమ్ముడైన డ్యూక్ ఆఫ్ యార్కు తలవనితలంపుగా సింహాసన మలంకరింపవలసి వచ్చెను. ఈ రాజ్యభారమును మోయుటకు సంసిద్ధుడుగ లేకపోయిననూ మిక్కిలి ధైర్యముతో నీవిధిని నెరవేర్చుటకు నిశ్చయించుకొనెను. రాజ్యమునకు రాగానే అప్పటికి డ్యూక్ ఆఫ్ యార్కుగనున్న ఈయన ఆఱవజార్జి చక్రవర్తి అయ్యెను. 12 మే 1937 న లండను నగరములోని వెస్టుమినిస్టరు యబ్బెలో పట్టాభిషేకమహోత్సవము జరిగెను.

సన్నాహము.

12 వ మే ప్రాతఃకాలమునుండియు మోటారులు యెడ తెగని ప్రవాహముగా వెస్టుమినిస్టర్ యబ్బెను సమీపించుచుండెను ప్రజలు ఉత్సాహపూరితులై గుంపులు గుంపులుగా యబ్బెను ప్రవేశించిరి. రాజదంపతులు బకింగుహామ్ రాజభవనమునందలి 'చైనీస్‌రూమ్' లో ప్రాతఃకాల భోజనముచేసిరి. 14 గురు అతిథులు వారి సహపంక్తిని భుజించిరి. వింతగొల్పు రంగుదుస్తులు కలిగిన 'ఇండియన్‌కన్‌టింజంటురాక' జనులగుంపులనుఆకర్షించినది ఇండియన్‌కన్‌టింజంటుహిందూ దేశపుసైన్యమునందలి 682 మేటి సేనానులతో నిండియుండి మిక్కిలి కొనియాడబడినది. వారు రాజభవమునమున కెదురుగా నిలిచియుండిన 10 నిమిషముల సేపు ప్రజలు మిక్కిలి ఉత్సాహమును జూపిరి. 9 గం 15 ని లకు బాల్డ్విను యితరమంత్రులతో గూడి బకింగ్‌హామ్ ప్యాలస్ నుండి యబ్బెకు బయలు దేరెను. బర్మాదేశపు డాక్టరు మాయును హిందూదేశపు సర్. యం. జఫ్రుల్లాఖాన్‌యును అందుండిరి. 9 గం 50 ని లకు రాజకుటుంబమువారు ఊరేగింపుతో యబ్బెకు బయలుదేరి 10 గం. 36 ని లకు జయధ్వానములతో 'యబ్బె'ను సమీపించిరి. జనులత్యుత్సాహముతో జయధ్వానములు చేయుచుండ రాజదంపతులు గడియారము సరిగా 11 కొట్టుసరికి యబ్బెను ప్రవేశించిరి.

## పట్టాభిషేకము.

రాజదంపతుల ప్రవేశముతో 'అబ్బె' స్వర్ణ కాంతితోనిండి జనామోదకరముగా నుండెను. అతిథులు తమ మనస్సులందు భక్త్యుత్సాహములు సందడింప రాజదంపతుల వీక్షించుచుండిరి. రాజుగారు ప్రజల జయధ్వానులకు సవినయముగా ప్రత్యుత్తర మిచ్చుచుండెను, టోపీని ధరించి నెమ్మదిగా పట్టాభిషేక మందిరమువైపు సాగెను. ప్రమాణము చేయునప్పుడు రాజుగారి కంఠధ్వని తక్కువగానున్నను, ఆడినమాటలు స్పష్టముగా నుండెను.

తదనంతరము మతసంబంధమగు ప్రక్రియ ప్రారంభమైనది. రాజదంపతులకు ఎడమ భాగమునందు అలంకృతులైన మరాధికారులు చేరిరి. హ్యాన్‌డెల్స్ యాన్‌తెమ్ పాడుచు ఛాంబర్‌లిన్ రాజుగారి యత్తిదుస్తులను విప్పి వేసెను. ఆర్చిబిషప్ ఆఫ్ కాంటర్‌బరీ అభిషేకము చేయుసమయమందు 4 గురుయోధులు రాజుగారి శిరముపై మేలుకట్టును పట్టుకొనియుండిరి. రాజుగారు తెల్ల చొక్కాయు, తెల్లటి మేజోడులను చెప్పులను ధరించి నిలువబడగా నాయన బాల్యము అందరికిని జ్ఞప్తికివచ్చెను. అనంతరము రాజుగారు స్వర్ణమయమైన దుస్తులను, ఉంగరమును, రాజదండమును ధరించి అభిషేక మహోత్సవమునకు సిద్ధులైరి. 12 గం 30 ని లకు ఆర్చిబిషప్ మతపీఠమునుండి కిరీటము తీసికొనివచ్చి 12గం 31లకు రాజుగారి శిరముపై దానినుంచెను. విజయకీర్తనలతోను రాజుగారు యశస్సుకోరు దైవప్రార్థనలతోను మతవిషయికమైన కర్మకాండముగిసెను. పిమ్మట ముఖ్యమరాధికారి నమ్రతచూపుచు రాజునకు నమస్కరించెను. ఆవెనుక డ్యూక్ ఆఫ్ గ్లాష్టరు మొదలగువారు వినతులొనరించిరి. రాణిగారిని రాజుగారి ఎడమ భాగమున నుంచి, ఆమె శిరముపై కూడ కిరీటమునుంచిరి. షుమారు 2 గం లకు పట్టాభిషేకమహోత్సవము ముగిసెను.

అభిషిక్తులై రాజదంపతు లావెనుక బకింగ్ హామ్‌ప్యాలెస్‌కు బయలుదేరిరి, పువ్వులవర్షమోయన వానప్రారంభమైనది. కాని రాజుగారి ఊరేగింపున కేమియు ఆటంకము కలుగలేదు. ఎన్నియో గంటలనుండి వేచియున్న జనులు సంతోషాంత రంగులై విప్పారిన నేత్రయుగ్మములతో వీక్షించుచుండ రాజదంపతులు బకింగ్ హామ్ భవనముచేరిరి.

## వీరి సందేశము.

పట్టాభిషేకానంతరము చక్రవర్తిగారు అన్ని దేశములవారిని సంబోధించుచు ఇట్లు మాటలాడి యుండిరి.—

నామనసార నీరాత్రి మీతో మాటలాడుచున్నాను. ఇదివరకెన్నడును ఏరాజునూ పట్టాభిషేకము కాగానే తమ తమ గృహములలో నున్న ప్రజలకందరికిని వినబడులాగున మాటలాడి యుండలేదు. అన్ని డొమినియనులునూ ఇంగ్లాండుతో సమానప్రతిపత్తితో నున్న కారణమున వెనుకటికంటె ఈ పట్టాభిషేకము ఎక్కువ ఆకర్షణీయమైనది. నిజముగ బ్రిటిషు సామ్రాజ్యమంతయు నీ ఉదయము వెస్టుమినిష్టరు యబ్బె నాలుగు గోడల మధ్య సమావేశమైనదని చెప్పవచ్చును. ఇదివరకు పరిచయమున్న స్నేహితులకునూ, నా కింతవరకు చూచు సదృష్టము పట్టని యితరదేశములవారికిని ఒక్కమారుగ మాట్లాడగలుగుచున్నందులకు నాకు అమితానందముగ నున్నది. ఈ సమయమున రోగపీడితులైనవారినీ, కష్టములలో నున్నవారినీ ప్రత్యేకముగ తలచుకొనుచూ ఎలిజబెత్ రాణియు నేనునూ మీ అందరికినీ శుభమును కోరుచున్నాము.

మా యెడల మీరు చూపిన గౌరవమునకు మీకు అభివందనము లిచ్చుటకు మాటలు చాలవు. ఈ రోజున వీధులలో మీరందరును చూపిన ప్రేమభావమునూ, ప్రపంచములోని ప్రతిచోటునుంచి మాకు మీరు పంపిన లెక్కకు మీరిన తంతివార్తలునూ మాకు పట్టరాని ఆనందము నిచ్చినవి. నేను మీకు చేయబోవు సేవ ద్వారా తప్ప నాకృతజ్ఞతను చూపలేను. మానవకోటికి 'రాజు' అనునది ఐకమత్యమును తెలియపరచు బాహ్యచిహ్నం. దైవకృపవలననూ, బ్రిటిషు సామ్రాజ్యములోని అందరి యిష్టము తోనూ పట్టాభిషిక్తుడ నైతిని. మీరాజుగానుండి ఆపదవికి గల గౌరవమును కాపాడు విధి తాత్కాలికముగ నాదై యున్నది. ఇది చాలా ఎక్కువ యైన బాధ్యత అయినప్పటికిని వెస్టుమినిష్టర్ యబ్బెకు వచ్చియుండిన మీవారందరిని చూడగా నేనీవిధిని నెరవేర్చగలనను ధైర్యము వచ్చినది. అచ్చట జరిగిన కార్యక్రమ మంతయు అనాదినుండి వచ్చుచున్న ఆచారమునకు సంబంధించినదైననూ దానిలో ఇమిడియున్న అర్థ మెప్పటికిని క్రొత్తయే. అట్టి భావపూరితమైన ప్రమాణమును రాణీ చెంతనుండగా నిశ్చలమైన మనస్సుతో నీఉదయము చేసియుంటిని.

దైవసహాయముతో మేము మావిధిని పూర్తిగ నెఱవేర్చగలము. ఇక్కడకు వచ్చిన మీరందనూ మీమీస్థలములకు పోయినప్పుడు మీరిక్కడ చేసికొనిన పరిచయములు ప్రపంచములో శాంతికిని స్నేహభావమును పెంపొందించుటకునూ ఎంతేని సాయపడగలవు. రాణీయు, నేనునూ ఈనాటి మనోవికాసము నెన్నటికిని మరువజాలము. మారాజ్యపాలనకు మొట్టమొదట మీరందరునూ చూపిన అపారమైన ప్రేమకు ఎప్పటికినీ పాత్రులముగ నుందుముగాక! అందరికినీ హృదయపూర్వక అభివందనములు. దేవుడు మీకు దీవనలిచ్చుగాక!

—జో॥ వెం॥

---

## నోటీసు.

విద్యాసంబంధమైన వ్యాసములను, విద్యాసంఘముల రిపోర్టులను, విద్యావిషయికసభల తీర్మానములను, స్కౌటు, రెడ్‌క్రాస్ విశేషములను మా 'ఆంధ్రరాష్ట్రప్రారంభవిద్య'లో ప్రచురింపదలచిన యెడల నా విషయములను చక్కగా పేజీకి ఒకవైపునవే వ్రాసి 1 వ తారిఖులోపల పంపిన ఆనెలసంచికలో ప్రచురింపగలము. అట్టి కాగితములు తిరిగిపంపబడవు. ప్రతివ్యాసమునకును ముందు వ్యాసముపేరునూ దానితరువాత వ్యాసకర్త పేరునూ, వారి చిరునామాయును ఉండితీరవలెను. సభలతీర్మానములుగాని, రిపోర్టులుగాని పంపదలచిన యెడల అట్టిసభల సెక్రిటరీలైననూ, ప్రెశిడెంటులైననూ సంతకములుచేసి పంపవలెను.

ఆ॥ రా॥ ప్రా॥ విద్య,

— సంపాదకుడు

# విద్యావిషయిక వార్తలు.

**1.** 28 వ చెన్నరాష్ట్రవిద్యావిషయిక సభ తంజావూరులో మేనెల 6, 7, 8 తారీఖులలో శ్రీమాన్ సి. రాజగోపాలాచారియరుగారి అధ్యక్షతక్రింద జరిగినది. సుమారు 700 మందిచెన్న రాజధానిలోని ఉపాధ్యాయులు ఈసభకువచ్చిరి. సభ జయప్రదముగా జరిగినది. ఆచార్యులవారు ఉపాధ్యాయులను తాము ఇతరవృత్తులవారికంటె హీనమనే భావమును వెంటనే పోగొట్టుకొనవలసినదనియు, అంతటి గౌరవనీయమైన పనివేరొకటి లేదనియు, S S L C పరీక్ష అనవసరమనియు అన్నిక్లాసులలోవలెనే స్కూలుఫైనలులోకూడ క్లాసుపరీక్ష చాలుననియు, గ్రామపునర్నిర్మాణము వెంటనే సాగుటకుగాను బి. ఏ పరీక్ష అయిన వారు అధమము ఆరునెలలు యిట్టి గ్రామసేవచేసినగాని డిగ్రీఇవ్వకుండ చేసెడి స్కీమును ఆచరణలో పెట్టిన చాలా బాగుండుననియు చెప్పియున్నారు.

* * * *

2. అగష్టు 2 మొదలు 7 వరకు జపానులో నున్న టోకియోలో జరుగబోవు నానాదేశ విద్యావిషయిక సభకు దక్షిణభారత ఉపాధ్యాయుల సంఘము తరఫున కాలికట్టులోని జమరీను కాలేజీ ప్రిన్సిపాలుగానున్న శ్రీయుత ఎ. వి. కుట్టి కృష్ణమీనన్‌గారిని పంపుచున్నారు.

* * * *

3. బొంబాయి రాజధానిలో స్కూలులేని ఊళ్లు 10,000 ఉన్నవని తేలినది. క్రొత్తగా వచ్చిన మంత్రివర్గము ఈ ఊళ్లలో అధమము ఊరు ఒకటికి ఒకపాఠశాలనైననూ స్థాపించుటకు గట్టి ప్రయత్నములు చేయుదురని తెలియుచున్నది.

* * * *

4. మన దేశములో మాట్లాడు భాషలసంఖ్య 225 వాటిలో ముఖ్యమైన భాషలు మాట్లాడు వారి సంఖ్య ఈదిగువ నీయబడినది.

| | | |
|---|---|---|
| హిందీ | 715 | లక్షలు |
| బెంగాలీ | 535 | ,, |
| బిహారీ | 279 | ,, |
| తెలుగు | 264 | ,, |
| మరాటీ | 209 | ,, |
| తమిళము | 204 | ,, |
| పంజాబీ | 158 | ,, |
| రాజస్థానీ | 139 | ,, |
| కన్నడము | 112 | ,, |
| ఒరియా | 112 | ,, |
| గుజరాతీ | 108 | ,, |
| మళయాళము | 91 | ,, |
| ఇంగ్లీషు | 3 | ,, |

ఇది 1931 సం॥ జనాభా లెక్కలనుబట్టి తయారుచేసిన పట్టిక. హిందీనేర్చినవారు 1931 తర్వాత మరికొన్ని లక్షలు ఉండి ఉండవలెను.

మన దేశములోనే యిన్నిభాషలని తలంపనక్కరలేదు. కెనడాలో 178 భాషలున్నవి. రష్యాలో 70 మాత్రమున్నవి.

* * * *

5. దక్షిణభారత ఉపాధ్యాయ సంఘము (South Indian Teachers' union) 1908 వ సంవత్సరములో స్థాపింపబడినది. మొన్న

మొన్ననే దీనికిచెందిన 28 వ చెన్నరాష్ట్రసభ సి. రాజగోపాలాచారియర్ గారి అధ్యక్షతక్రింద తంజావూరులో జరిగినది. ఈసంఘమునకు ప్రస్తుతము 15 జిల్లాసంఘములునూ యీజిల్లాలకు సంబంధించని 16 ఉపాధ్యాయుల సంఘములునూ చెందివున్నవి. రాష్ట్రమంతటిలోని ఉపాధ్యాయుల తరఫున మాటలాడగల పెద్ద సంఘము ఇదిఒక్కటియే (1) ఈసంఘము 'South Indian Teacher') అనునొక ఆంగ్ల మాసపత్రికను Balar Kavi అనునొక తమిళ మాసపత్రికను నడుపుచున్నది (2) 5 సంవత్సరములనుండి రాష్ట్రమంతటనూ విద్యావారమును సాగించుచున్నది. (3) దానికిచెందిన టీచర్లకు సౌకర్యముగా నుండుటకు South Indian Teachers' Protection Fund అనుదానిని ఏర్పరచియున్నది (ఈ Fund ను గురించి జూన్ పత్రికలో వివరముగా చెప్పబడును) (4) Service conditions bill అనునొక చట్టమును తయారుచేస గవర్నమెంటువారి ముందు పెట్టబోవుచున్నది. (దీనినిగురించికూడ తరువాత పత్రికలో వ్రాయబడును.) (5) అన్నిస్కూళ్ళకును అవుసరము వచ్చినప్పుడెల్లఒక Questionnaire ను తయారుచేసిపంపి జవాబులను తెప్పించుకొని మొత్తముమీాద విద్యకు సంబంధించిన విషయములలో రాష్ట్రములోనున్న అన్నిస్కూళ్ళ అభిప్రాయములను రాబట్టుచున్నది. (6) సంఘముతరఫున Academic council కునూ, Senate కునూ ఎలెక్షనుకు కొంతమందిని నిలుచుండబెట్టి నెగ్గినవారిద్వారా ఆయాసంస్థలలో తన ఆశయములను అమలులోనికి తెచ్చుటకు ప్రయత్నములు చేయుచున్నది. (7) ఈమధ్యజరిగిన 28 వ వార్షికోత్సవ సందర్భమున ప్రయిమరీ ఎడ్యుకేషను యొక్క రిఆర్గనైజేషను స్కీమునొకదానిని తయారుచేసి యున్నది.

* * * *

6. దక్షిణ ఆర్కాడు జిల్లాలోని అన్ని ఎలిమెంటరీ ఉపాధ్యాయులకును కడలూరులో ఒకటియు, విల్లిపురంలో ఒకటియు Refresher course లను 10 వ మే మొదలు 16 జూన్ వరకునూ గవర్నమెంటువారు జరుపుట కేర్పాట్లుచేసినారు. ఈ అయిదువారములలో సమావేశమైన ఉపాధ్యాయులకు వ్యవసాయము గ్రామ పారిశుద్ధ్యము, పరిశ్రమలు, కోఆపరేటివ్ సొసైటీలు, మొదలైన వాటినిగురించి చెప్పబోవుచున్నారు.

* * * *

7. చిత్తూరు బోర్డు హైస్కూలు ఉపాధ్యాయులు 40 మంది ప్రధానోపాధ్యాయులైన జె. డానియల్ గారితో సహా ఒకతోటలో మే 3 వ తారీఖున క్యాంపు వేసిరి. రోజంతయువారు బోధనాపద్ధతులను గురించియు, స్కూలు డిసిప్లిన్ నుగురించియు తీవ్రముగా చర్చించిరి. "ముద్దుపిల్లలను పైకితీసకొని వచ్చుటెట్లు" "పిల్లల ఇంగ్లీషుభాషను అభివృద్ధిచేయుటెట్లు" "విద్యాదాహమును పిల్లలలో కలిగించుటెట్లు" "హిష్టరీ జాగ్రఫీలలో కురవానికి సరదా పుట్టించుటెట్లు" "స్కూలుయొక్క డిసిప్లిన్ బాగుచేయుటెట్లు" అను విషయముల మీాద 5 గురు ఉపాధ్యాయులు మాట్లాడిన పిదపవాటి మీాద చర్చలు జరిగెను. అన్ని క్లాసుల మానేటర్లు సభ్యులుగానూ, ప్రధానోపాధ్యాయుడు ప్రశిడెంటుగానూఉండు Court of Honour అను దానిని స్కూలు తెరువగానే స్థాపించి తద్వారా స్కూలుయొక్క డిసిప్లిన్ అభివృద్ధిచేయుటకు స్థిరపరుపబడెను. —జో॥ వెం॥

# సభలు.

## జలుమూరు బాల విజ్ఞాన సంఘ ప్రథమ వార్షికోత్సవము.

17-4-37 తేదీని జలుమూరు బోర్డు హయ్యరు ఎలిమెంటరీ పాఠశాలలో గల బాల విజ్ఞాన సంఘముయొక్క ప్రథమ వార్షికోత్సవము శ్రీకాకుళం రేంజీ జూనియరు డిప్యూటీ యిన్‌స్పెక్టరు గారైన మ॥ రా॥ శ్రీ॥ యమ్. గోపాలస్వామినాయుడు బి. యె. బియిడిగారి అధ్యక్షత క్రింద జరుపబడినది. ఈసభకు సుమారు 60 మంది ఉపాధ్యాయులును సుమారు 200 మంది బాలురును హాజరైరి. సంఘ కార్యదర్శి నల నాగుల చంద్రశేఖరము అధ్యక్షుని యెన్నుకొని ఆతని పుష్పమాలాలంకృతుని గావించిరి. బాలురచే మనోజ్ఞతమముగా రాగయుతముగా ప్రార్థన జరుపబడెను. శ్రీ నాయుడుగారు ప్రారంభోపన్యాసము నొసంగినపిదప సంఘకార్యదర్శి వార్షిక నివేదికను జదివెను. అందు యీ సంఘము యేర్పడుటకు కారణములు, పరిస్థితులు. అది యీ వత్సరముచేసినపని మున్నగు నంశములు మనోహరముగా వ్రాయబడి యుండెను.

సంఘ సభ్యుడగు డబీరు హరిహర దాసుచే "ప్రారంభ విద్య ముగించిన బాలుర కర్తవ్యము" ను విషయముపై నొక యుపన్యాసమును, పైడి నరుసునాయుడు, కుప్పిలి రామారావులచే, "విజ్ఞానసంఘముల యావశ్యకత" గూర్చి రెండు యుపన్యాసములును, హాలు మహంతి కామేశ్వర రావుచే "ప్రాథమిక విద్య దానిలాభములు గూర్చి వేరొక యుపన్యాసమును హృదయంగమముగా చదువబడెను. బుడితెగ్రామము బోర్డు హయ్యరు ఎలిమెంటరీ పాఠశాల ఉపాధ్యాయులుగా పనిచేయుచున్న మ॥ రా॥ శ్రీ॥ పారసంది జగన్నాథముగారు బాల విజ్ఞాన సంఘములు గూర్చి అమూల్యమైన యుపన్యాస మొసంగుచు బాలురు దానిలో పాల్గొనినందులకు వారిని హెచ్చరించిరి. వక్తృత్వమును, వ్యాసరచనకును, అర్థపొందికముగా పద్యమును చదువుటకును గానమునకును బహుమానములు బాలుర కొసంగబడెను.

అనంతరము యీసంఘోన్నతికి సూచన లొసంగుచు బాలురు నాటక కళాభిరుచిని వృద్ధి చేయుటయందు అభిరుచి గలిగియుండవలె ననియు బాలుర విహారముల కొన్నిటిని సల్పుచుండవలె ననియు, పఠశాల విడిచిన బాలురు "మనబడి మన ఉపాధ్యాయులు" అనువిషయముల విస్మరింపక ప్రాతవిద్యార్థి సంఘముల నేర్పరచవలె ననియు వారిచే పాఠశాలలో గల విద్యార్థులు మంచి సలహాలు పొందుచుండవలె ననియు, మున్నగు విషయములతో బాలుర కుత్తేజన కరమగు గంభీరోపన్యాసము అధ్యక్షునిచే నొసంగబడెను. పిదప కార్యదర్శి అధ్యక్షునియెడ కృతజ్ఞతాభివందనము లొనరించి సభికుల నందరిని అల్పాహారవిందున కాహ్వానించెను. విందు ముగిసిన పిదప పాఠశాలలోగల బాలభటులచే బాలభట ప్రదర్శనము జరుపబడెను. అంతటితోనాటి సభ ముగిసెను. మరునాడు పఠశాలోపాధ్యాయులును, అధ్యక్షుడును, బాల విజ్ఞాన సంఘ సభ్యులును ఒక ఛాయాపటము తీసికొనిరి. యన్ చంద్రశేఖరరావు, కార్యదర్శి.

# పశ్చిమగోదావరీ మాండలికోపాధ్యాయ పండిత పరిషత్తు.

ది 10-4-1937 శనివారమునాడు పెనుగొండ మిడిల్ స్కూలులో మహారాజశ్రీ జవ్వాది లక్ష్మయ్య (డిస్ట్రిక్టుబోర్డు మెంబరు, పెనుగొండ యూనియన్ ప్రసిడెంటు) గారి అధ్యక్షతక్రింద జరిగిన పశ్చిమగోదావరీ మాండలికోపాధ్యాయ పండిత పరిషచ్చతుర్థ వార్షిక మహాసభయందు ఈక్రింది తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపబడినవి.

1. ఈపరిషత్తున కధ్యక్షులగు బ్రహ్మశ్రీ ఉప్పులూరి సీతారామశాస్త్రిగారి యకాలమరణమునకు ఈసభవారు మిగుల విచారించుచు వారికుటుంబమునందు సానుభూతిని జూపించుచు వారి యాత్మశాంతికి భగవంతుని ప్రార్థించుచున్నారు.

2. ఎగ్జెంప్టెడ్ పండితులకు గూడ ఓరియంటల్ డిగ్రీలు పొందినవారితో సమానముగా గ్రేడు ఇప్పించగలందులకు ప్రభుత్వము వారిని ఈసభవారు కోరుచున్నారు.

3. పండితులకు నిర్ణయించిన గ్రేడులో (45/2/2/75) మినిమము మేగ్జిమము కొంతవరకు తృప్తికరముగా నున్నను ఇంక్రిమెంటు అసంతృప్తికరముగా నున్నందున ఆగ్రేడును 45/5/2/75 నైన మార్పు చేయవలసినదిగా ప్రభుత్వము వారిని ఈసభవారు కోరుచున్నారు.

4. విశ్వవిద్యాలయ సంఘ సభ్యుని ఎన్నుకొనుటలో దగిన యధికారమును ఓరియంటల్ డిగ్రీలు పొందినవారికిగూడ నీయవలసినదిగా ఈ సంఘమువారు విశ్వ విద్యా లయాధికారులను గోరుచున్నారు.

5. ట్రయినింగు స్కూళ్ళలోను హైయ్యర్ ఎలిమెంటరీ స్కూళ్ళలోనుగూడ దేశభాషల నేర్పుటకు పండితులను వేయవలసినదిగా ఈసభవారు తీర్మానించడ మయినది.

6. ప్రైవేటు స్కూళ్లలో పనిచేయుచున్న పండితులుగూడ ఈ గ్రేడ్డు 45/5/2/75 ఈయవలసినదని తత్తదధి కారులను నియమించవలసినదిగా ప్రభుత్వమువారిని ఈసభవారు కోరడమయినది."

7. పండితుల జీతములను నెం 3395. 3639 G O. ల ప్రకారము హెచ్చించిన సందర్భములో అంతకుంబూర్వమే ఎక్కువ సర్వీసులలో నండి డిగ్రీలు పొందిన పండితులకు సర్వీసు ననుసరించి అడ్వాన్సు ఇంక్రిమెంట్సు ఇప్పించగలదులకు ఈ సభవారు కోరుచున్నారు.

8. పరిష చ్ఛందాలను వెంటనే పంపగోరుచున్నాడను

శ్రీమత్ప్రతివాది భయంకరం కృష్ణమాచార్యులు,
కార్యదర్శి.

# శ్రీ కస్తూరి హిందూయెలిమెంటరీ పాఠశాల, ఏలూరు.

ప్రథమవార్షిక మహోత్సవము సదరు పాఠశాల భవనమునందు ది 25-4-37 ఆదివారం సాయంత్రం 3 ఘంటలకు పశ్చిమగోదావరిజిల్లా విద్యాశాఖాధికారిగారగు శ్రీయుత జి. దామోదర మొదలియారు అవర్గళ్ (బి ఏ. ఎల్. టి.) వారియధ్యక్షతక్రింద జరిగినది.

తత్సందర్భమునకు ప్రేక్షకులుగా ఏలూరు రేంజి సీనియరు మరియు జూనియరు డిప్యూటీ యిన్స్పెక్టరుగార్లును, విద్యాభిమానులు, కొంతమంది న్యాయవాదులు, మ్యునిసిపలు కౌన్సిలరును, జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలరున్ను, పిల్లల తల్లిదండ్రులును, తదితరులు అనేకమంది వచ్చియున్నారు.

దైవప్రార్ధన, సభాధ్యక్షుల ప్రారంభోపన్యాసములతో సభప్రారంభమయినది.

"పేరంటల్ కో ఆపరేషను - విద్య" యను యంశములను గురించి చాలమందియుపన్యసించిరి.

సదరు యీపాఠబాల బాలబాలికలచే "శ్రీకృష్ణతులాభారము" అనునాటకము ప్రదర్శింపబడి, ప్రేక్షకులచేతను విద్యాశాఖాధికారులచేతను విద్యాభిమానులచేతను కొనియాడబడినది. మ॥ రా॥ శ్రీ ఈదర వెంకయ్యపంతులుగారిచే వుచితముగ యివ్వబడిన షుమారు రు 10-0-0 విలువగల పుస్తకములను బొమ్మలను బాలబాలికలకు మ్యునిసిపల్ కౌన్సిలరుగారగు శ్రీమతి శృంగారకవి లక్ష్మీనరసమ్మగారిచే బహుమతులుగా యివ్వబడెను.

సభాధ్యక్షుల ప్రారంభోపన్యాసము ముగిసన తరువాత పాఠశాలయొక్క రిపోర్టు చదువబడెను. అందు,—

ఈ పాఠశాల శ్రీ కస్తూరి హిందూయెలిమెంటరీపాఠశాల" యనుపేర 1933 సం॥ జనవరిలో ఒక్క వుపాధ్యాయునితో 30 పిల్లలతోను ప్రారంభింపబడి సత్వరములోనే రికగ్నైజుచేయబడి, కొద్దినెలలలో కొన్నిఆపదలకు లోనై వాటినుండి భగవంతునిదయవలన కడతేరినదనియు మొదటస్థాపింపబడిన పాఠశాలభవనము చాల సందున ప్రస్తుతపాఠశాలభవనమును నిర్మించి, కొంతవ్యయప్రయాసలతో యిటీవల నాపరాయి కూడ పరపించినటులను ప్రథమములో షుమారు 30 మందిపిల్లలు ఒకవుపాధ్యాయునితోను ప్రారంభింపబడిన యీపాఠశాల క్రమక్రమము యిప్పటికి పిల్లలసంఖ్య 125 కును వుపాధ్యాయులసంఖ్య 5 కును వృద్ధిపొందినదనియు బోధనోపకరణములగు కొన్నిచార్టులు వగైరాలు మేనేజిమెంటు స్వంతముగా తయారు చేసినటులను నవారుబద్దినేత వగైరా చేతిపనులు నేర్పుచున్నటులను యిటీవల గవర్నమెంటువారివలన ఫర్నిచరుగ్రాంటుకూడ పొందినటులను మేనేజరు దెల్పిరి. ఇంతవృద్ధికికారణం (1) పిల్లలతలిదండ్రులవాత్సల్యత (2) విద్యాధికారుల యొక్కయు జిల్లా ఎడ్యుకేషనులు కౌన్సిలు వారియొక్కయు ప్రేమ (3) సహోపాధ్యాయుల సహకార సహాయములనియు, యికముందుకూడ వీరందరును అట్టివాత్సల్యమును వుంచి పాఠశాలాభివృద్ధికొరకు సహాయము చేయగలందులకు మేనేజరగు కస్తూరి ఆనందరావుగారు కోరుతూ రిపోర్టు ముగించెను.

సభాధ్యక్షుల ముగింపు వుపన్యాసముతోను మంగళముతోను సభముగించబడెను.

(స్వకీయవిలేఖరి)

---

# వింతలు — విశేషములు.

1. ఇద్దఱు పంజాబు యువకులు ఒక చక్కని గిత్తదూడను ఆఱవజార్జిచక్రవర్తిగారి పట్టాభిషేక సందర్భమున ఇంగ్లాండు తీసికొని పోవుచున్నారు. ఆదూడ కూడికలను, తీసివేతలను, చిన్న చిన్న గుణకార భాగహారములను చేయగలదట. ఇట్టి వింతను జార్జి సార్వభౌమునకు చూపనుద్దేశించి ఆయువకులట్లు చేయుచున్నారని తెలియుచున్నది.

*　　*　　*　　*

2. అనాథలైన పెక్కుమంది బ్రిటిషుపిల్లలను చక్రవర్తిగారి పట్టాభిషేక సందర్భమున ఒకలైనుగా నిలుచుండబెట్టి, ఇతరదేశములనుండి రాబోవుచున్న వందలాది ప్రజలకుచూపి, ఇష్టమున్నవారు, వారు ఏరుకొనిన వారిని దత్తత చేసుకొనుటకు ఏర్పాట్లు చేయుచున్నారట.

*　　*　　*　　*

3. రావల్‌పిండి వాసియైన ఒక మంత్రికాడు 15 సంవత్సరములనుండి గొప్పగొప్ప సభలలో చాకులను మ్రింగే మాజిక్ ఎన్నోమారులు జేయుచూ వచ్చుచున్నాడు. ఈమాజిక్‌వల్ల అతడు చాలాధనమును సంపాదించినాడట. కాని గతనాలుగు నెలలనుండి మ్రింగిన చాకులు ఎప్పటికప్పుడు యీవలికి రాక పొత్తికడుపువద్ద బాధ ప్రారంభమై పెషావరు ప్రాంతముననున్న ఒకడాక్టరుచే x-ray ఫొటోను తీయించుకుని బొంబాయికిపోయి అచ్చటపొట్టను శస్త్రము చేయించగా దానినుండి మొత్తము 18 చాకులు వెలువడినవట! అతడు యింకా ఆసుపత్రిలోనే ఉన్నాడు.

*　　*　　*　　*

4. ఖారస్, గాంధి, షరీఫ్ అను ముగ్గురు భారతయువకులు ప్రపంచమునంతను చూచి వచ్చుకోరికతో సైకిళ్లమీద 30 ఏప్రిల్ 1933 న బొంబాయివద్ద బయలుదేరి 17 ఏప్రిల్ 1937 నకు 34,000 మైళ్లు పూర్తికాగా కేప్‌టౌను జేరినారట. అక్కడనుంచి రయోడజనీరోకు పడవమీదవచ్చి దక్షిణఅమెరికా, ఉత్తరఅమెరికా, ఆస్ట్రేలియా, బర్మాలమీదుగా తిరిగి ఇండియా జేరెదరని తెలియుచున్నది. (తిన్నగా యీక్వేటరుమీదుగా భూమిచుట్టుకొలత 25,000 మైళ్లు మాత్రమే.)

*　　*　　*　　*

5. అమెరికాలోని బ్రూక్లిను వెలీ గ్రామమునకు చెందిన 91 సం॥ వయస్సుగల యాంబ్రూస్ డగ్లస్ అను ఒకనీగ్రోకు మొదటి భార్యవల్ల 26 గురును రెండవ భార్యవల్ల యింతవరకు 12 గురును వెరశి 38 మంది సంతానము కలిగినారట. వీరికి నామకరణములు చేయుటకు తండ్రికి సరియైనపేర్లు దొరకక 1, 2, 3 అని అంకెలతో వారిని పిలుచుట అవుసరమని తలచుచున్నాడు.

*　　*　　*　　*

6. ప్రస్తుతము మనము 'రేడియో' ద్వారా ప్రపంచములో నేమూలనో పాడుచున్న పాటలను వినుచున్నాము. ఆపాడెడి వ్యక్తిని కూడ 'టెలివిషన్' ద్వారా కొన్నిదేశములలో చూచుచున్నారు.

మార్కొనుమూర్కొని అను ఇటలీదేశపు శాస్త్రజ్ఞడు 'ఎలెక్ట్రిక్ పవరు'ను కూడా 'రేడియో' ద్వారా పంపుటకు రెండుసంవత్సరములనుండి ప్రయత్నము చెయగా ఈమధ్యనే

సఫలీకృతుడైనట్లు తెలియుచున్నది. ప్రపంచము లోని శాస్త్రజ్ఞు లెల్లరును దీనికి మిక్కిలి ఆశ్చర్య పడుచున్నారు.

ఇదే నిజమనయెడల, ఎక్కడనోవున్న ఎలెక్ట్రిక్ పవరునుతీగద్వారాగాక వట్టిగాలిద్వారా ఎంతోదూరముతీసికొనిపోయిఅచ్చటనున్న అన్ని యంత్రములను తిరుగునట్లుచేసి యిదివరకుకంటె కొన్నివేలరెట్లు ఎక్కువగా పరిశ్రమలను అభివృద్ధి చేయవచ్చును. ప్రపంచ పరిణామములో మనమిప్పుడు ఊహింపలేనంత గొప్పమార్పు కలుగుట నిశ్చయము.

* * * *

7. ప్రెశిడెంటు రూజివెల్టు (అమెరికా) నకు సామాన్య ప్రజలవద్దనుండి వారి కష్టసుఖములు తెలియపరుచు ఉత్తరములు దినమున సగటున 10, 000 వచ్చునట. వాటిని 12 గురు గుమాస్తాలు ముందుగా పరిశీలించి వాటిలో కొన్నిటెకు వారే సమాధానములు వ్రాయుదురట. మిగత ఉత్తరములు మేడమీదికి పంపబడును. వాటిని రూజివెల్టుగారి శక్రటరీలు చూచి సమాధానములు కొన్నిటికి తామే వ్రాయుదురట. మిగత ఉత్తరములు ప్రశిడెంటు స్వయముగా చూచుకుని సమాధానములను 90 నిమిషములలో డిక్టేటుచేయునట. బుట్టదాఖలా ఉత్తరములుండనే వుండవట. అన్ని ఉత్తరములకును సమాధానములు సాయంకాలములోపల వెళ్ళవలసినదే! x x x x

8. "విమానం గంటకి దాదాపు 1000 మైళ్లు వెళ్లగలిగితే భూమిని ఎన్నాళ్లల్లో చుట్టుతిరిగి రాగలదు" అని I C S పరీక్షలో అడిగితే ఒకురాశు 1 రోజుఅనీ, యింకోడు 2 రోజులనీ, మూడవవాడు 0 రోజులనీవ్రాసినారట. సామాన్యంగా పేపర్లుదిద్దే ఆయన బుర్రలో ఏదోఒక ఆన్సరుంటుంది. అది కనబడకపోతే లెఖ్ఖనికొట్టి పారేస్తాడు. కాని వీళ్లపేపర్లు దిద్దిన ఆయన కొంచెం చాదస్తం మనిషి. మొదణ్ణించి చివరకంటా ముగ్గురు వ్రాసిన వర్కింగు చదివిముగ్గురి ఆన్సర్లుకూడా రైటే అనిస్థిరపరచి అందర్నీ ప్యాస్ చేశాట్ట! ఆముగ్గురు వ్రాసినకారణాలు ఏమిటంటే.

1. భూమిచుట్టుకొలత దాదాపు 24000 మైళ్లు. గంటకు 1000మైళ్లచొప్పున వెళ్లేవిమానం 24 గంటలలో తిరిగిరావాలిఅంటే ఒకరోజులో.

2. సూర్యుడు నెత్తిమీదఉండగా విమానము తూర్పుగా బయలుదేరిందనుకుందాము. విమానంలో ఉన్నవాడికి తొందరతొందరగా సాయంకాలంపడిపోతూన్నట్టుకనుపిస్తుంది. చీకటిఎంతో సేపు ఉండకుండానే తెల్లవారిపోయినట్టుంటుంది. ఈవిధంగా విమానం భూమిచుట్టుకొలతలో సగం వెళ్లేసరికి సూర్యుడుకూడా రెండోవైపునుంచి సరిగా అక్కడికేవచ్చి మధ్యాహ్నము అయినట్టు అగుపిస్తాడు. మధ్యాహ్నం మొదలు మధ్యాహ్నం వరకూ రోజు. భూమిచుట్టుకొలత సగంవెళ్లడానికి 1రోజు పట్టినదిగనుక, పూర్తిగా తిరిగిరావడానికి 2 రోజులు పడుతుంది (విమానంలో ఉన్నవారికి 2 రోజులులాగు కనుపిస్తుంది కాని, తిరిగిరావడానికి పట్టేకాలం 24 గంటలే!)

3. సూర్యోదయం అవుతూండగా విమానం పడమరగా బయలు దేరింది అనుకుందాం. సూర్యునివేగం, విమానవేగం ఒకటే ఆయింది గనుక విమానం ఎక్కడికెళ్లినా సూర్యోదయం అప్పుడే అవుతూన్నట్టుంటుంది. తిరిగి బయలుదేరినచోటికి తిరిగివచ్చినా తెల్లవారుతున్నట్టే వుంటుంది. అందుచేత విమానంలో ఉన్నవాడికి 0 రోజులలో భూమిని చుట్టివచ్చినట్టుంటుంది. (నిజంగా ఇప్పుడుకూడా 24 గంటలే పట్టింది కాని ఎక్కడికెళ్లినా సూర్యోదయమే కనుక టైము ఏమీ కదలకుండా ఉన్నట్టు కనుపిస్తుంది.)

జో॥ శం॥

వాడేల లక్ష్మమ్మ, బెజవాడ,
మారుతిరాం అండ్ కో., ది.... ...... 1937.
**Educational Publishers &c.,**

# మనవి.

అయ్యా,

బెజవాడలో పై పేరుతో నాభర్త వాడేల రామయ్యా పంతులు గారు ఒకపుస్తకములషాపు స్థాపించి సుమారు 18 సంవత్సరములనుంచి వ్యాపారము నడుపుచుండిరి. వారు సంవత్సరముక్రిందట అకస్మాత్తుగ మరణించిరి. తదాదిగ, పై పేరుతో నేనే వ్యవహారము నడుపుచుంటిని. సదరు కంపెనీకి సంబంధించిన, ఉత్తరములు, మనియార్డర్లు, రిజిష్టర్లు వగైరాలు నాకుగాని, నాఆర్డరు పొందిన వారికి గాని యిచ్చుచుండిరి.

కాని యిటీవల, నాభర్తగారి అన్నగారు అన్యాయముగా వ్యవహారపుచిక్కులు పెట్టినందున ప్రస్తుతము సదరు కంపెనీ పేరుతో మాత్రమువచ్చు వుత్తరములు, మనియార్డర్లు, రిజిష్టర్లు వగైరాలు నాకు యిచ్చుట ఆపుజేసినారు.

పైకంపెనీకి నేను సర్వాధికారినై సర్వహక్కులతో నేనే వ్యాపారము నడుపుచున్నాను గనుక యింతటినుంచి యావత్తు వుత్తరప్రత్యుత్తరములు, మా పుస్తకములకొరకిచ్చు ఆర్డర్లు, మనియార్డర్లు, యిన్సూర్లు, రిజిష్టర్లు, బ్యాంకు చెక్కులు వగైరాలు క్రమమైన నాదిగువ యడ్రసు ప్రకారం వ్రాసిన వెంటనే జవాబులు బడయగలరు. గాన అభిమానులందరు అడసుక్రిలో మార్పునుగమనించి మాప్రత్యర్థుల యసత్యప్రచారమునకు లోనుగాక పూర్వమువలెనే ఆదరాభిమానములుంచి మా వ్యాపారమును నిర్విఘ్నముగా కొనసాగింతురుగాక యని మనవి జేయుచున్నాను.

ఇట్లు,
**వాడేల లక్ష్మమ్మ,**
ప్రొప్రైట్రిస్,
మారుతిరాం అండ్ కో., బెజవాడ.

పట్టాభిరామా ప్రెస్, ఏలూరు

# స్కౌటు సంగతులు.

### అఖిల భారత స్కౌటు సమావేశము

దీనిని ఆంగ్లమున All India Scout Jamboree అందురు. ఇట్టి సమావేశము మన దేశములో జరుపుటకిదియే మొదటిసారి. ఈ ప్రథమ అఖిలభారత స్కౌటుసమావేశము ఢిల్లీలో కడచిన ఫిబ్రవరి నెలలో మొదటి వారములో జరిగినది. మన దేశములోని అన్ని రాష్ట్రములనుండి యుండియు సుమారు 4000 మంది స్కౌట్లునూ స్కౌటు మాష్టర్లునూ ఈసమావేశమునకు హాజరైరి. మన చెన్న రాష్ట్రమునుండి వెళ్ళినవారిసంఖ్య 65. అందులో మన తెలుగుజిల్లాలకు చెందినవారు 10 మంది మాత్రమే ఉన్నారు. స్కౌటు సమావేశములలో అన్ని సమావేశములలోవలె సంతర్పణ భోజనములుండవు. చక్కని మేడలను ఖాళీ చేయించి విడిదెలుగానివ్వరు. పదిమంది కుర్రవాళ్ళుకలిసి వారిబసను వారే నిర్మించుకుని, వారి భోజనములను వారే వండుకొనితినుచూ కార్యక్రమములోని ప్రతిపిలుపునకును ఆకాలమునకు హాజరగుచుండవలెను. ఢిల్లీ అందరికినీ క్రొత్తచోటగనుక 400 గుడారములు సిద్ధముగా నుంచబడెను. ఒక్కొక్క రాష్ట్రమునుండి ఒక్కొక్కగుంపు స్కౌట్లు రాగానే ఆగుంపులోని ప్రతి పదిమందికిని ఒక గుడారముచొప్పున సప్లయిచేయబడినవి. జనవరి 31 వ తారీఖు మధ్యాహ్నమువరకు నిర్జనప్రదేశమైయున్న పెద్ద మైదానముమీద 24 గంటల కాలములో 400 గుడారములు వీధులు తీర్చి నిర్మింపబడినవి. ప్రతి వీధిమొగనూ ఒక పెద్ద గేటుకూడ నిర్మింపబడెను. మన చెన్న రాష్ట్రమునుండి వెళ్ళినస్కౌట్లు వారి వీధిముగలో కర్రలతో ఒక పెద్ద గోపురమును కట్టిరి. ఉత్తరహిందూస్థానమునుండి వచ్చిన వారందరునూ దీనిని మిక్కిలి మెచ్చుకొనిరి. ఆగుడారములలో స్కౌట్లు 7 దినములు కార్యక్రమ ప్రకారముగడిపిరి. కుర్రవాళ్ళుచేసిన చేతి పనులు వేరొకచోట ప్రదర్శింప బడినవి. స్కౌట్ల సౌకర్యముకొరకు ఒకప్రత్యేకగుడారములో ఒక పోష్టుఆఫీసును, మరియొకదానిలో ఆసుపత్రియు, మరికొన్నింటిలో దుకాణములునూ ఏర్పరుపబడెను. ఈగుడారములతో నిండిన చిన్నపట్టణమునకు వేరుగ పోలీసువారు లేరు. రోవరుస్కౌట్లలో కొందరుపోలీసుగ పని చేసిరి. కొందఱు దారి చూపువారుగనుండిరి. కొందఱు ఉత్తరములను, వార్తాపత్రికల నిచ్చువారుగను, మరికొందఱు నీటిపంపులవద్దను, పాయిఖానల వద్దనూ కాపలా కాయువారుగను, ఢిల్లీపట్టణము నెఱిగియున్న మరికొందఱు పట్టణము నందలి ముఖ్యమైన చోట్లను తమతోటి స్కౌట్లకు చూపువారుగను పనిచేసిరి.

ఇట్టి సమావేశములవల్ల లాభములు మా చదువరులే ఊహించుకొనగలరు. ఢిల్లీకి పోయిన ప్రతి స్కౌటు కుర్రవానికిని ఇప్పుడు మన దేశములోని ప్రతి జిల్లాయందునూ అధమము ఒక్క స్నేహితుడైననూ ఉన్నాడని మనము నమ్మవలసి యున్నది.

* * *

## పర్యాయ పదములు.

'స్కౌటు' అనునది ఆంగ్లపదము. దీనికి తెనుగున కొందఱు 'బాలభటుడు' అనియు కొందఱు 'బాలవీరుఁడు' అనియు అనుచున్నారు. భటుడు అను మాటలో పోలీసుకును, మిలిటరీ కిని సంబంధించిన అర్థముండి సేవకావృత్తిని తెలియపరచును గనుక 'బాలభటుడు' అను మాట ప్రస్తుతము చాలవరకు వాడుట తగ్గించి నారు. అసలు 'స్కౌటు' అను మాటలో మంచి శీలమునూ ఎక్కువ తెలివితేటలునూ, పరిశీలనా శక్తియూ, స్వతంత్రశక్తియు, త్యాగబుద్ధియూ యిమిడియున్నవి గావున అట్టి అర్థమునే స్ఫురింపజేయు 'బాలవీరుడు' అను మాట ప్రస్తుతము ఎక్కువ వాడుకలో ఉన్నది. ఆంగ్లమున 'స్కౌటు' అన్ననూ తెనుగున 'బాలవీరుడు' అన్ననూ 12 సంవత్సరములు మొదలు 17 సంవత్సరముల వయస్సుగలవారికే చెందును.

7 సంవత్సరములు మొదలు 11 సంవత్సరముల వయస్సువారికి ఆంగ్లమున 'ఉల్ఫ్ కబ్బులు' (wolf cubs) అనియూ తెనుగున 'కిశోరవీరులు' అనియూ అందురు.

17 సంవత్సరముల పై వారికి ఆంగ్లమున రోవరు స్కౌటు (Rover Scout) అనియూ తెనుగున 'యౌవన వీరుడు' అనుట వాడుక.

* * *

## తెనుగు స్కౌటు పుస్తకములు.

స్కౌటింగుకు చెందిన పై మూడు భాగము లను గురించియు శ్రీయుత పరిగె వెంకటరమణా రావు బి. ఏ. బి.యిడి గారు "ఆంధ్రవీరుడు" అను 300 పేజీల గ్రంథమును తెనుగున వ్రాసి యున్నారు. దాని ఖరీదు 0-12-0. ప్రత్యేకముగ కిశోరవీరుల భాగమును మాత్రమే 'కిశోరవీరులు' అను పుస్తకముననూ, యీ కిశోరవీరులకు తరిబీతు నెట్లులీయవలెనో ఉపాధ్యాయులకు తెలియజేయు 'కిశోరవీర తరబీతు విధానము' అను దానినీ తెనుగునవ్రాసియున్నారు. ఈ రెండునూ ఒక్కొక్కటి 0-4 0 ఖరీదు. ప్రస్తుతము తెనుగున వ్రాయబడిన స్కౌటు గ్రంథము లివి మాత్రమే. వెంకట్రామ్ అండ్ కో (ఏలూరు) వారు పై పుస్తకములను సప్లయి చేయగలరు.

* * *

# ఇండియన్ రెడ్ క్రాస్ సొసైటీ.

### 1. ఆశయములు.

జూనియరు రెడ్‌క్రాసు బాలబాలికలకు చెందిన సంస్థ. ఇది రెడ్‌క్రాసు సొసైటీలో ఒకభాగము మాతృసంస్థవలెనే, దీనికిని రాజకీయ మతవర్ణ వివక్షతలేదు. నానాదేశముల వ్యాప్తిగాంచిన అంతర్జాతీయ సంస్థ విశ్వమానవ సామరస్యమల వఱచుకొని విద్యార్థులు ప్రబోధముకాంచగలందు లకై శాంతికాలమున రెడ్‌క్రాసుసొసైటీ కార్యక్రమములో ఇదిఒకఅంగముగా ఏర్పఱుపబడినది.

దీనిఆశయములు (1) ఆరోగ్యాభివృద్ధి (2) పరోపకారము (3) విశ్వమానవ సామరస్యము. ఉపదేశమున మాత్రమేగాక అనుష్ఠానమునగూడ పై ఆశయములను సాధింప యత్నించుచున్నది.

*　　*　　*

### 2. పుట్టుపూర్వోత్తరములు.

ఈ సంస్థ చరిత్ర చిత్రమైనది. విశ్వమును క్షోభింపచేసిన ఐరోపా మహాసంగ్రామమే దీని జన్మకారణము. ఇది బోధించునది మానవ సౌభ్రాతృత్వము, భూతదయ

కెనడాదేశమున క్విబెకుపట్టణములో ఈ యుద్యమము తొలుదొల్త బయలుదేరెను. 1914 లో అచట బాలబాలికలు రెడ్‌క్రాసు పనిలో చేయిజేసికొని సైనికులకు కట్లుకట్టుట మందులిచ్చుట మున్నగు ఉపచారములు చేయుచుండిరి. కెనడాలో ఇతరరాష్ట్రములకు గూడ ఇది ప్రాకెను. 1915 లో ఐరోపా అంతటను వ్యాపించెను. కాని ఈఉద్యమమునకు అమెరికా సేవ మహత్తరమైనది. అచట ఒకకోటి పది లక్షలమంది బాలబాలికలు ఇందులో చేరి సైనికులకు ఉపచరించియు, ఆసుపత్రులందు సౌకర్యము లెక్కువచేసియు, అనాథ శిశువులకు ఆశ్రయమిచ్చియు సాయపడిరి.

యుద్ధానంతరము ఈ జూనియర్ రెడ్‌క్రాసును యేమిచేయవలెనని ఆలోచించగా విద్యాధికారులందఱును ఉద్యమమును సాగించుచుండవలెనని ముఖ్యముగా కోరిరి. పసివారి మనస్సులందు ఇది సుగుణపుంజమును మొలకెత్తజేయుచుండుటకు వారత్యంతము హర్షించిరి.

అమెరికాను అనుసరించి ఇతరదేశములందు గూడ 1920 కి ఈ ఉద్యమము వ్యాప్తిగాంచెను. అప్పటినుండి సక్రమాభివృద్ధి గాంచుచున్నది. ప్రకృతము 50 దేశములందు దేశీయ సంస్థలు గలవు ప్రపంచమంతటను దీనిలో సభ్యులు ఒకకోటి 30 లక్షలు. పెద్దల సంఖ్యకన్న పిన్నల సంఖ్యయే రెడ్‌క్రాసులో అధికముగానున్నది.

*　　*　　*　　*

### 3. హిందూదేశమున అభివృద్ధి.

జూనియరు రెడ్‌క్రాసు హిందూదేశమున 1925 లో ప్రారంభమాయెను. 1926 లో పంజాబు రాష్ట్రమున మొదలు పెట్టిరి. అచట దీని ఆశయములు యువజనుల మనసులకెక్కెను. తరువాత సంయుక్తపరగణాలు, మధ్యపరగణాలు, ఢిల్లీ, బొంబాయి మున్నగు రాష్ట్రములందును, కొన్ని సంస్థానములందును విలసిల్లెను. 1933 సంవత్సరాంతమునకు జూనియర్ రెడ్‌క్రాసు బృందములు 5,297 విద్యాలయములందుండెను. ఇందు 2,46,802 బాలురు 6,139 బాలికలు గలరు. విద్యాధికారులును విద్యాసంస్థలు ఈ విషయమై చాల ఉత్సాహము చూపుచున్నవి దీనివలన కలుగు ఆరోగ్యపరిజ్ఞానము త్యాగబుద్ధి ప్రపంచమును సుఖతరముగ చేయగలవు. 1932 లో పంజాబునందు చాల బాలికలు తమ చిల్లరడబ్బుల మిగిల్చి రూ. 1,00,000 వేసూర్చి బీదవిద్యార్థులకు రోగులకు

ఆరోగ్య ప్రచారమునకు వినియోగింప గలిగిరి. ఉద్యమప్రయోజనమున కిది మంచి తార్కాణము

* * * *

### 4 జూనియర్ రెడ్‌క్రాసు కార్యకలాపము.

జూనియర్ రెడ్‌క్రాసు పాఠశాలలో ఒక అంగము. విద్యార్థులు సభ్యులు. ఉపాధ్యాయుడు వారి నాయకుడు, హితైషి. విద్యార్థులే నిర్వాహకులను ఎన్నుకొని కార్యకలాపమును నిర్వర్తించెదరు. తమ ఆరోగ్యమును రక్షించుకొనుటకు, ఇతరులకు ఉపకరించుట, ముఖ్యముగా రోగులకు సాయపడుటకు సభ్యులు దీక్ష పూనెదరు. ప్రపంచములోగల బాల బాలికలందఱిని స్నేహితులుగా భావించుకొనుట వారివిధి. సభ్యులొక్కొక్కరు చందా చెల్లింపనక్కఱలేదు. బృందము సమిష్టిని రిజిస్ట్రేషను ఫీజుగా హైస్కూలు లేక కాలేజియైనయెడల రు. 2, ఇతర పాఠశాలయైన యెడల ఒక్కరూపాయ చెల్లింపవలెను.

తమ సమర్థత, స్థానికావసరములను బట్టి ఆయాబృందములు తమ కార్యక్రమము నేర్పఱచుకొనవచ్చును. ప్రధానకార్యాలయము వారీక్రింది అంశములను ముఖ్యముగా పరిగణించుచున్నారు.

#### 1 ఆరోగ్యాభివృద్ధి.

(1) ఆరోగ్యకరమైన అభ్యాసములు. 14 యేండ్లకు లోబడిన కుఱ్ఱవాండ్రు ఆరోగ్యక్రీడ (హెల్తుగేము) ఆడుట మంచిది.

(2) పాఠశాల ఆవరణమున పరిశుభ్రత. విద్యార్థులే ఊడ్చి శుభ్రపఱచుటకు ఉత్సహింపబడుచున్నారు. కిటికీలు తెఱచియుంచుట, మురికిలేని తుంప్లు ఉమ్మివేయకుండుట మున్నగు అంశములు గమనింపవలెను. అన్నిటికన్న పరిశుభ్రముగా నుండు క్లాసుగదికిగాని విద్యార్థిగదికిగాని బహూకరణము లిచ్చుట ప్రోత్సాహముగా నుండును.

(3) ఆరోగ్య చిత్రపటములు, ఉపదేశవాక్యములు ఆయత్తపఱచుట.

(4) పల్లెలందును పట్టణములందును ఆరోగ్య ప్రచారము—ఊరేగింపులు, నాటకములు మున్నగునవి.

(5) గ్రామపరిశుభ్రతకు, ప్లేగు కలరా మున్నగు అంటువ్యాధుల నివారణకు ఆరోగ్యాధికారులకు తోడ్పడుట.

(6) విద్యార్థుల వైద్యపరీక్షకు తోడ్పడుట

(7) గ్రుడ్డితనము రాకుండచేయు ప్రయత్నములకు సహాయపడుట దీనికి ప్రధానకార్యాలయమువారుపకరణముల సమకూర్చి యున్నారు.

#### 2. మానవ సేవ.

(1) ప్రథమచికిత్స గృహచికిత్సలందు శిక్షణ పొందుట.

(2) బీదవిద్యార్థులకు పుస్తకములు, మందులు భోజనము, దుస్తులుసహాయము చేయుట.

(3) గ్రామస్థులకు ప్రథమచికిత్సచేయుటకు పాఠశాలలందు ఏర్పాట్లు చేయుట

(4) రెడ్‌క్రాసు వారములు, ఆరోగ్యవారములు, ఆరోగ్యప్రదర్శనములు మున్నగు వానిలో పెద్దలకు తోడ్పడుట.

(5) వఱదలు, కఱవులు, అగ్నిప్రమాదములు భూకంపములు మున్నగునవి వచ్చినపుడు బాధితులకు సహాయము చేయుట.

#### 3. విశ్వమానవ సౌమనస్యము.

(1) ఒక దేశమునుండి ఇంకొక దేశపు విద్యార్థులు చిత్తరువులు లేఖలు వ్రాతపుస్తకములు తెప్పించుకొని, ఆయాసీమల ప్రజలు, పరిశ్రమలు, వ్యాపారములు ప్రకృతివిశేషములు తెలిసికొనుట. ఇట్టి అన్యోన్యతవలన స్నేహముతోబాటు జ్ఞానమును కలుగును.

(2) ప్రపంచములో ఇతరదేశములందు జూనియర్ రెడ్‌క్రాసు సంఘములు చేయుపని తెలిసికొనుటకై రెడ్‌క్రాసు జర్నలువారు ప్రచురించు జూనియరు రెడ్‌క్రాసు అనుబంధమును పఠించుట.

—(మదరాసురాష్ట్రశాఖవారిప్రచురణము.

# రామా పద్యవాచకములు.

కె. హెచ్. వి యన్. నారాయణ, బి. ఏ , యల్. టి.

శేషాద్రిరమణకవులు, శతావధానులు గార్లచే

| | | | |
|---|---|---|---|
| మొదటి తరగతి | (అప్పుడు) | ... | 0 1 6 |
| రెండవ తరగతి | ... | ... | 0 1 6 |
| మూడవ తరగతి | ... | ... | 0 2 0 |
| నాల్గవ తరగతి | ... | ... | 0 2 0 |
| ఐదవ తరగతి | ... | ... | 0 2 6 |

చిన్నకోట వెంకట రంగారావు బి, ఎ, ఎల్. టి., గారిచే

| | | | |
|---|---|---|---|
| ఆరవ తరగతి | ... | ... | 0 3 0 |
| ఏడవ తరగతి | ... | ... | 0 4 0 |
| ఎనిమిదవ తరగతి | ... | ... | 0 6 0 |

# రామా గణితదర్పణములు.

గిడుగు వేంకటరామమూర్తి, బి. ఎ ఎల్. టి.

తోపల్లి వెంకటప్పయ్య, బి. ఎ. ఎల్. టి. గార్లచే వ్రాయబడి

(యస్. గోపాలం బి, ఎ ఎల్ టి. గారిచే శిక్షైజా చేయబడినవి)

| | | | |
|---|---|---|---|
| మొదటి తరగతి | (అప్పుడు) | ... | 0 3 0 |
| రెండవ తరగతి | .. | ... | 0 5 0 |
| మూడవ తరగతి | ... | ... | 0 7 0 |
| నాల్గవ తరగతి | ... | ... | 0 10 0 |
| ఐదవ తరగతి | ... | ... | 0 12 0 |



# రామాహితోపదేశవాచకములు.

విద్వాన్ గరిమెళ్ళ సోమన్న పంతులుగారు, యం ఎ., యల్. టి. గారిచే

| | | | |
|---|---|---|---|
| రెండవ తరగతి | (అప్పుడు) | ... | 0 2 0 |
| మూడవ తరగతి | ... | ... | 0 3 0 |
| నాల్గవ తరగతి | ... | ... | 0 4 0 |
| ఐదవ తరగతి | ... | ... | 0 5 0 |

# రామా సివిక్సు పాఠములు.

బి. లక్ష్మీనారాయణశాస్త్రి, ఎం. ఏ. (ఆనర్సు) ఎల్. టి. గారిచే

| | | | |
|---|---|---|---|
| రెండవ తరగతి | (అప్పుడు) | ... | 0 2 6 |
| మూడవ తరగతి | .. | .. | 0 3 0 |
| నాల్గవ తరగతి | ... | ... | 0 4 0 |
| అయిదవ తరగతి | ... | ... | 0 5 0 |

మహాకాళి సుబ్బారాయుడు గారిచే

| | | |
|---|---|---|
| సివిక్సు వ్యాఖ్యాయలు 4, 5, తరగతులకు | ... | 0 6 0 |

# రామా ప్రకృతి శాస్త్రవాచకములు.

Dr వేపా వరాహ నరశింహంగారు, యం ఏ,

తెంపెల్లి సూర్యనారాయణమూర్తి గారు, డి. వి. అఫ్ స్కూల్సు గారిచే

| | | | |
|---|---|---|---|
| రెండవ తరగతి | (అప్పుడు) | ... | 0 3 0 |
| మూడవ తరగతి | ... | ... | 0 4 0 |
| నాల్గవ తరగతి | ... | ... | 0 5 0 |
| ఐదవ తరగతి | ... | ... | 0 6 0 |

# రామా గుణిత బోధినీలు.

ప్రాథమిక పాఠశాలల తరగతుల బాలురకు వర్ణక్రమమును నేర్పుట
కీపుస్తకములు మిగుల యుపయుక్తములు.

| | | | |
|---|---|---|---|
| మొదటి భాగము | (అప్పుడు) | ... | 0 1 6 |
| రెండవ భాగము | ... | ... | 0 2 0 |
| మూడవ భాగము | ... | ... | 0 2 0 |
| నాల్గవ భాగము | ... | ... | 0 2 0 |

# రామా పురాణపాఠములు.

మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిచే
డాక్టరు వేపా వరాహనరసింహము పంతులు, ఎం. ఎ. గారిచే
పరిష్కరింపబడినవి.

| | | | |
|---|---|---|---|
| మొదటి తరగతి | (అప్పుడు) | ... | 0 2 6 |
| రెండవ తరగతి | ... | ... | 0 2 6 |
| మూడవ తరగతి | ... | ... | 0 3 0 |
| నాల్గవ తరగతి | ... | ... | 0 4 0 |
| ఐదవ తరగతి | ... | ... | 0 5 0 |

# రామా లోకజ్ఞానములు.

గిడుగు వేంకట రామమూర్తిగారు, బి. ఏ., యల్. టి., గారిచే

| | | | |
|---|---|---|---|
| రెండవ తరగతి | (అప్పుడు) | ... | 0 3 0 |
| మూడవ తరగతి | ... | ... | 0 4 8 |
| నాల్గవ తరగతి | ... | ... | 0 5 0 |
| అయిదవ తరగతి | ... | ... | 0 8 0 |
| 3, 4, తరగతులకు ఇకేబుక్కు | | ... | 0 10 0 |



# రామా జిల్లా భూగోళములు.

(అప్పుడు)

విద్వాన్ గరిమెళ్ళ సోమన్న పంతులు, ఎం. ఏ., ఎల్. టి, గారిచే
విశాఖపట్నం. తూర్పుగోదావరి పశ్చిమగోదావరి, కృష్ణ, గుంటూరు,
నెల్లూరు, కర్నూలు, కడప, బళ్లారి, అనంతపురం, చిత్తూరు, జిల్లాల
భూగోళములు ప్రతిజిల్లా భూగోళం 1 కి ... 0 4 0

క్రొత్తపద్ధతి ననుసరించి
మండలేముల వెంకటశాస్త్రి బి. ఏ., ఎల్. టి గారిచే,

1. గంజాంజిల్లా భూగోళము ... 0 4 0

ఊ. సత్యనారాయణ డిప్యూటీ ఇన్స్పెక్టరు. యం. ఏ., ఎల్. టి గారిచే

2. విశాఖపట్నంజిల్లాభూగోళం ... 0 6 0

ఫార్టి రాఘవేంద్రరావుగారు, బి. ఏ., గారిచే

3. తూర్పుగోదావరిజిల్లాకథ (అప్పుడు) 0 6 0

డి సత్యనారాయణమూర్తిగారిచే, బి. ఏ. ఎల్. టి,

4. పశ్చిమ గోదావరి జిల్లాభూగోళం ... 0 6 0
5. గుంటూరుజిల్లా భూగోళం ... 0 4 0

యస్ లక్ష్మీనరసయ్యగారు యం. ఏ., ఎల్. టి, గారిచే

6. కర్నూలు జిల్లా భూగోళం ... 0 4 0

మం వెంకటసుబ్బయ్య గారిచే

7. కడపజిల్లా భూగోళం ... 0 4 0

మండా కృష్ణమూర్తిగారిచే,

8. ఏజన్సీ భూగోళం ... 0 4 0

# రామా నాటకముల కథలు.

వి. సుబ్బారాయుడు & యమ్. సుబ్బారాయుడు గార్లచే.

(అప్పుడు)

| | | | |
|---|---|---|---|
| మొదటి తరగతి | 0 2 0 | నాల్గవ తరగతి | 0 4 0 |
| రెండవ తరగతి | 0 2 6 | ఐదవ తరగతి | 0 5 0 |
| మూడవ తరగతి | 0 3 0 | | |

# జాగ్రఫీలు.

ఆర్. శేషగిరిరావు, బి ఏ., యల్. టి. గారిచే

| | | |
|---|---|---|
| మొదటిఫారం 6 వ తరగతికి | (అప్పుడు) | 0 8 0 |
| రెండవ ఫారం 7 వ తరగతికి | ... | 0 10 0 |
| మూడవఫారం 8 వ తరగతికి | ... | 0 12 0 |

నాల్గవ ఫారముకు (బి రామచంద్రరావు, ఎమ్. ఏ., ఎల్. టి గారిచే) యం. సీతారామాచార్యులు, బి ఎ ఎల్. టి. గారిచే వ్రాయబడిన

| | | |
|---|---|---|
| చెన్నపురిరాజధానిభూగోళం | ... | 0 6 0 |

## రామాజాగ్రఫీ మ్యాపుడ్రాయింగు బుక్కులు.

(నవీన పద్ధతులననుసరించి నూతన ప్రణాళికాను గుణ్యముగ తయారు చేయబడినవి)

| | | | |
|---|---|---|---|
| [illegible] వ తరగతికి | 0 3 0 | 3 వ ఫారము | 0 5 0 |
| 1 వ ఫారము | 0 3 0 | 4 వ ఫారము | 0 6 0 |
| [illegible] వ ఫారము | 0 4 0 | ట్రయినింగు స్కూళ్ళకు | 0 6 0 |
| | | 5-6 ఫారములకు | 0 6 0 |

# రామా గణిత సారములు.

ఆర్. వీరభద్రరావు బి. ఏ., ఎల్. టి. గారిచే వ్రాయబడి

(కె. వి సుబ్బారావు B. A. L. T గారిచే రివైజు చేయబడినవి.)

| | | | |
|---|---|---|---|
| నాల్గవ తరగతి | (అప్పుడు) | ... | 0 8 0 |
| అయిదవ తరగతి | . . | ... | 0 10 0 |
| తెనుగు లెక్కలబుక్కు (పుట్లు, వెరసులువగైరా) | ... | | 0 3 0 |
| [illegible]టి లెక్కలబుక్కు 2-5తి వరకు... | ... | | 0 4 0 |
| గణితబోధిని (ఎక్కములు, మానములు) | ... | | 0 1 0 |



# రామా తాలూకా భూగోళములు.

| | | |
|---|---|---|
| తిరువూరు తాలూకా భూగోళం | ... | 0 3 0 |
| తెనాలి తాలూకా చరిత్ర భూగోళం | ... | 0 3 0 |
| బాపట్ల తాలూకా చరిత్ర భూగోళం | . . | 0 2 0 |
| గుంటూరు తాలూకా చరిత్ర భూగోళం | ... | 0 2 0 |
| గుత్తితాలూకా భూగోళం | . . | 0 3 0 |
| కంభం తాలూకా భూగోళం | . . | 0 3 0 |
| ఏలూరు తాలూకా భూగోళం | . . | 0 2 6 |
| నంద్యాలతాలూకా భూగోళం | ... | 0 3 0 |

# రామ హిందూదేశ చరిత్రలు.

వురిటి రామమూర్తిగారిచే వ్రాయఁబడి,

జి రంగారావునాయుడు, బి., ఎ., ఎల్, టి, గారిచే సరిచూడఁబడినవి.

| | | |
|---|---|---|
| రామా హిందూదేశచరిత్ర 4 త॥ | ... | 0 4 0 |
| హిందూ దేశచరిత్ర 5 త॥ | . . | 0 5 0 |

జి వి. సీతాపతి బి. ఏ ఎల్, టి., గారిచే

| | | |
|---|---|---|
| మొదటి ఫారం 6 వ తరగతికి | . . | 0 8 0 |
| రెండవ ఫారం 7 వ తరగతికి | .. | 0 10 0 |
| మూడవ ఫారం 8 వ తరగతికి | .. | 0 12 0 |

మునిమాణిక్యం నరశింహ్వారావు బి. ఏ. ఎల్, టి, గారిచే

| | | |
|---|---|---|
| కృష్ణామండల చరిత్ర | ... | 0 3 0 |

# ప్రథమ పాఠశాలారోగ్య బోధిని.

శిష్టా గోపాలం బి. ఎ ఎల్ టి గారిచే వ్రాయబడినది.

| | | | |
|---|---|---|---|
| 2, 3, తరగతులకు | (అప్పుడు) | ... | 0 2 0 |
| 4, 5, తరగతులకు | | ... | 0 4 0 |

# తెలుగు టెక్స్టుబుక్కు ఆఫ్ అరిథ్ మెటిక్

యస్. రాధాకృష్ణఅయ్యర్, బి. ఏ.,

కే. వైద్యనాధస్వామి అయ్యర్, బి, ఏ., గార్లచే. (క. రంగాచారి ఎం.ఏ.బి.,యల్. యల్. టి విజయనగరంవారిచే సవరింపబడినవి.)

| | | |
|---|---|---|
| మొదటి ఫారమునకు | (అప్పుడు) | 0 10 0 |
| రెండవ ఫారమునకు | ... | 0 10 0 |
| మూడవ ఫారమునకు | ... | 0 10 0 |

జే. గంగాధరం బి. ఏ. ఎల్. టి. గారిచే

| | | |
|---|---|---|
| నాల్గవ ఫారమునకు | ... | 1 0 0 |

## ఉపాఖ్యానములు - నిఘంటువులు.

| | |
|---|---|
| నీతిశాస్త్రము టీక | 0 2 0 |
| ఆంధ్రనామసంగ్రహము | |
| మూలము | 0 2 0 |
| డిటో టీక | 0 6 0 |
| ఆంధ్రనిఘంటుత్రయము | |
| రేపరు | 0 8 0 |
| డిటో అట్ట | 0 10 0 |
| డిటో క్యాలికో | 0 14 0 |
| ప్రహ్లాద చరిత్ర సప్తమ | |
| స్కంధము | 0 6 0 |
| కుచేలోపాఖ్యానము (పోతన) | |
| డిటో టీక | 0 4 0 |
| నలోపాఖ్యానము టీక | 0 6 0 |

| | |
|---|---|
| కుచేలోపాఖ్యానము | |
| (గట్టుప్రభువు) | 0 6 0 |
| భర్తృహరి సుభాషితము | |
| (నీతిశతకము) | 0 4 0 |
| అమరకోశము ప్రథమకాండము | |
| మూలము | 0 2 0 |
| డిటో డిటో టీక | 0 6 0 |
| అమరము త్రికాండము అట్ట | 1 0 0 |
| డిటో క్యాలికో | 1 12 0 |
| మొల్లరామాయణము | 0 8 0 |
| ధర్మసూక్ష్మము | |
| (పద్యకావ్యము) | 0 4 0 |



# రామా శాస్త్ర వాచకములు.

టి వి నరసింగరావు ఎమ్. ఎ. ఎల్ టి. ప్రొఫెసర్.
బి. హెచ్ పట్టాభిరామయ్య యం ఏ యల్. టి.
సి. భానుమూర్తి బి, ఏ ఎల్. టి. గార్లచే.

| | | |
|---|---|---|
| మొదటి ఫారము | (అప్పుడు) | 0 8 0 |
| రెండవ ఫారము | ... | 0 8 0 |
| మూడవ ఫారము | ... | 0 10 0 |

# రామా ఆంధ్రవ్యాకరణ పాఠములు.

యణ్ సి హెచ్. వెంకట రామానుజాచార్యులు గారిచే.

| | | |
|---|---|---|
| 4, 5 తరగతులకు | (అప్పుడు) | 0 3 0 |
| 1 వ ఫారమునకు | .. | 0 4 0 |
| 2 వ ఫారమునకు | ... | 0 4 0 |
| 3 వ ఫారమునకు | .. | 0 4 0 |
| రామా ఆంధ్రవ్యాకరణ సర్వస్వము 4, 5, 6 ఫారములకు శేషాద్రి రమణ కవులచే | ... | 0 10 0 |
| కర్త కర్మ క్రియాబోధిని | ... | 0 0 6 |
| భాషాభాగ ప్రదీపిక | ... | 0 0 6 |

## ట్రెయినింగు స్కూళ్ళ పుస్తకములు.

| | | |
|---|---|---|
| భూగోళశాస్త్రము (నూతనసిలబసు ననుసరించి) | | 1 4 0 |
| లెక్కల పుస్తకము | ... | 2 0 0 |
| న్యాచురలు ఫినామినా | ... | 0 8 0 |
| ఎలిమెంటరీ సైన్సు | ... | 0 8 0 |
| సృష్టివిద్య-తోటపని (వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము & న్యాచురలుఫినామినాకలిసి) | ... | 1 4 0 |
| ఆంధ్రలక్షణ చంద్రిక | ... | 0 5 0 |
| సోషియాలజీ | .. | 0 12 0 |
| పాఠక్రమ సూచిక | ... | 0 8 0 |
| విద్యాబోధనా తత్వము | ... | 0 12 0 |

# వివిధ గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| ఆత్మరాభ్యాస సహకారికా చిత్రలేఖనము. | మొదటిభాగం | | 0 2 0 |
| డిటో | రెండవ భాగం | | 0 2 0 |
| మృగముల డ్రాయింగు బుక్కు | | ... | 0 2 0 |
| పక్షుల డ్రాయింగు బుక్కు | | ... | 0 2 0 |
| తెనాలి రామలింగని వింతకథలు | | ... | 0 3 0 |
| వ్యవహారబోధిని మొదటిభాగం | | ... | 0 4 0 |
| డిటో రెండవభాగం | | ... | 0 4 0 |
| సృష్టిపరిశీలన (నేపూరి లక్ష్మీనరసయ్యగారిచే) | | ... | 0 4 0 |
| ఇంగ్లీషు గృహోపాధ్యాయుండు (Private Tutor of English) | | ... | 0 4 0 |
| ఇంగ్లీషు కాన్వరుశేషన్ 4 తి॥ | | ... | 0 3 0 |
| డిటో | 5 తి॥ | .. | 0 4 0 |
| రామేశ్వర మజిలీకథలు | | ... | 0 12 0 |
| బ్రహ్మోత్తరఖండము-హరికథ | | ... | 1 0 0 |
| రామకృష్ణజంత్రి 1, 2, 3, భాగములు | | ... | 2 0 0 |
| డిటో 3 వ భాగముమాత్రము | | ... | 0 8 0 |
| కుశలవ నాటకము | | ... | 0 12 0 |
| భగవద్గీత క్యాలికో బైండు-తాత్పర్యముతో | | .. | 0 8 0 |
| డిటో సాదాబైండు | | ... | 0 6 0 |
| అధ్యాత్మ రామాయణ కీర్తనలు | | ... | 0 6 0 |
| డిటో క్యాలికో బైండు | | ... | 0 10 0 |



| | | |
|---|---|---|
| లలిత సహస్రనామము | ... | 0 6 0 |
| డిటో క్యాలికో బైండు | ... | 0 8 0 |
| శ్రీరామసహస్రనామస్తోత్రము | ... | 0 4 0 |
| విష్ణుసహస్రనామస్తోత్రము | ... | 0 4 0 |
| శ్రీలక్ష్మీసహస్రనామస్తోత్రము | ... | 0 3 0 |
| శ్రీఆంజనేయ సహస్రనామస్తోత్రము | ... | 0 3 0 |
| శ్రీశివసహస్రనామస్తోత్రము | ... | 0 3 0 |
| శ్రీగణపతిసహస్రనామస్తోత్రము | ... | 0 3 0 |
| లక్ష్మీ నృసింహస్తోత్రము టీక | ... | 0 2 0 |
| భజగోవిందం | ... | 0 2 0 |
| మోక్షగుండరామాయణం (హరికథ) | | 2 8 0 |
| అష్టాదశ పురాణసారము 1, 2, 3, 4 భాగములు భాగము 1 కి | | 1 0 0 |
| అన్ని భాగములు కలిపి క్యాలికో | | 4 8 0 |
| హస్తసాముద్రికము | | 0 4 0 |
| శ్రీమదాంధ్ర మహాభారతము (వచనము) ఆది-సభాపర్వములు | | 2 0 0 |

## ముసునూరి శర్మగారి పరిష్కృతములు.

| | |
|---|---|
| భాషీయదండకము | 0 2 0 |
| చంద్రశేఖరశతకము | 0 2 0 |
| ఉద్భ్రాంత స్వప్నము | 0 2 0 |
| శ్రీమదాంధ్ర మహాభారతము (వాక్యవిరామాదుల తెలుపు గుర్తులతో) శాంతిపర్వము | 2 0 0 |

# సెకండరీ స్కూళ్ళ

## ఉపవాచకములు.

(మదరాసు దొరతనమువారిచే అంగీకరింపఁబడినవి.)

| | | | |
|---|---|---|---|
| నీతికథామంజరి 2, 3, 4, భా॥ | 0 2 0 | యదువంశము | 0 3 0 |
| ఆంధ్రరాజులు | 0 3 0 | రఘుకుల వీరులు | 0 8 0 |
| ఆంధ్రులు | 0 3 0 | దశావతారములు (బొమ్మలతో) | |
| ఉపాఖ్యాన రత్నావళి | 0 3 0 | | 0 8 0 |
| భోజ చరిత్ర | 0 4 0 | షట్చక్రవర్తులు | 0 8 0 |
| పర్వదినమహాత్మ్యము | 0 4 0 | పరశురాముని చరిత్ర | 0 8 0 |
| జాతీయకథావళి | 0 4 0 | రామాయణసారము | 0 8 0 |
| ప్రహ్లాదచరిత్ర | 0 4 0 | ఉత్తరరామాయణసారము | 0 8 0 |
| భీష్మమహిమ | 0 5 0 | రాజసూయము | 0 8 0 |
| పురాణచంద్రిక I. భా॥ | 0 4 0 | ప్రతాపరుద్రుడు | 0 8 0 |
| డిటో II భా॥ | 0 6 0 | చారిత్రనాటకపంచకం | 0 8 0 |
| కథారామాయణము | 0 6 0 | గద్యపద్యావళి | 0 8 0 |
| అభిమన్యుడు | 0 6 0 | కృష్ణవేణి | 0 8 0 |
| అజ్ఞాతవాసము | 0 6 0 | భారతసారము | 0 10 0 |
| నీలచంద్రిక | 0 6 0 | భాగవతకథాసారము | 0 10 0 |
| రణతిక్కన చరిత్ర | 0 6 0 | తిన్నఁడు గుణనిధి | 0 10 0 |
| రుద్రమదేవి | 0 6 0 | బృహన్నల విజయము | 0 15 0 |
| శ్రీరామచంద్రమూర్తి | 0 6 0 | కల్పలత | 0 10 0 |
| కర్ణునిచరిత్ర | 0 8 0 | ఇందుమతి (నవల) | 0 12 0 |
| భీష్మచరిత్ర | 0 8 0 | హరివంశము | 0 12 0 |
| కురువంశము | 0 8 0 | పాఠ్యపరీక్షావ్యాసములు | 1 0 0 |



## బాలుర కుపయుక్తమగు శతకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| సుమతీశతకము | మూలము | 0 1 0 | నృసింహశతకంమూలము | | 0 1 6 |
| డిటో | టీక | 0 2 0 | డిటో | టీక | 0 4 0 |
| కృష్ణశతకము | మూలము | 0 1 0 | వేమన శతకము | మూలము | 0 1 0 |
| డిటో | టీక | 0 3 0 | డిటో | టీక | 0 3 0 |
| కుమారశతకము | మూలము | 0 1 6 | బాలరామాయణము టీక | | 0 2 0 |
| డిటో | టీక | 0 3 0 | డిటో | మూలం | 0 1 0 |
| దాశరథీశతకము | మూలము | 0 1 0 | గజేంద్రమోక్షము మూలము | | 0 2 0 |
| డిటో | టీక | 0 4 0 | డిటో | టీక | 0 6 0 |
| భాస్కర శతకం | మూలము | 0 1 0 | డిటో | క్యాలికో బైండు | 0 8 0 |
| డిటో | టీక | 0 4 0 | రుక్మిణీకల్యాణం | మూలము | 0 2 0 |
| | | | డిటో | టీక | 0 6 0 |
| | | | డిటో | క్యా॥ బైండు | 0 8 0 |

### స్త్రీలకుపయుక్తమగు ఉపవాచకములు, శతకములు.

## సతి శిరోమణులు.

మహావాది వెంకటరత్నంగారిచే

| | | | | |
|---|---|---|---|---|
| అభ్యాసపాఠం | 0 2 6 | నోముల కథలు | | 0 4 0 |
| సతీశిరోమణులు 1 భా॥ | 0 3 0 | కుమారీశతకము | | 0 1 0 |
| సతీశిరోమణులు 2 భా॥ | 0 3 0 | డిటో | టీక | 0 2 0 |
| ,, 3 భా॥ | 0 4 0 | సుదతినీతిశతకము | | |
| 4 భా॥ | 0 5 0 | | మూలము | 0 1 6 |
| ,, 5 భా॥ | 0 6 0 | డిటో | టీక | 0 3 0 |
| ,, 6 భా॥ | 0 6 0 | పూర్వహైందవ స్త్రీల చరిత్ర | | |
| 7 భా॥ | 0 6 0 | | మొదటిభాగం | 0 3 0 |
| ,, 8 భా॥ | 0 6 0 | డిటో | రెండవభాగం | 0 3 0 |
| ,, అభ్యాసవాచకం | 0 2 0 | రామా తెలుగు కాపీలు — 1,2,3,4,5 | | |
| భారతనారీమణులు | 0 6 0 | | నెంబర్లు ఒక్కొకటి | 0-0-9 |
| అనసూయ | 0 4 0 | | డజను 0-7-0 1 గ్రోసు | 4-8-0 |

# స్కూళ్ళ రిజిష్టర్లు.

| | | |
|---|---|---|
| అట్టెండెన్సు రిజిష్టరు 12 పే॥ | ... | 0 2 0 |
| డిటో డిటో 24 పే॥ | ... | 0 4 0 |
| డిటో డిటో 36 పే॥ | ... | 0 6 0 |
| డిటో డిటో 48 పే॥ | ... | 0 8 0 |
| డిటో డిటో 60 పే॥ | ... | 0 10 0 |
| డిటో డిటో 72 పే॥ | ... | 0 12 0 |
| డిటో డిటో 84 పే॥ | ... | 0 14 0 |
| డిటో డిటో 100 పే॥ | ... | 1 0 0 |
| అడ్మిషను రిజిష్టరు 12 పే॥ | ... | 0 2 0 |
| డిటో 24 పే॥ | ... | 6 4 0 |
| అడ్మిషను ఫారములు 100 పే॥ | ... | 0 8 0 |
| టీచర్ల అట్టెండెన్సు రిజిష్టరు నెం 1 రు | ... | 0 2 0 |
| డిటో నెం 2 రు | ... | 0 3 0 |
| డిటో నెం 3 రు | ... | 0 4 0 |
| ప్రోగ్రెస్ కాండక్టు రిజి॥ 50 పే॥ | ... | 0 3 0 |
| డిటో రిజి॥ 100 పే॥ | ... | 0 5 0 |
| డిటో రిజి॥ 150 పే॥ | ... | 0 7 0 |
| డిటో రిజి॥ 200 పే॥ | ... | 0 9 0 |
| లీవింగు సర్టిఫికెట్టు బుక్కు 25 ఫారములు డూప్లికేటుతో | | 0 2 0 |
| ,, డిటో 50 ఫారములు డిటో | ... | 0 4 0 |
| అక్విటెన్సు రోలు | ... | 0 3 0 |
| విజిటర్సు బుక్కు | ... | 0 3 0 |
| ఫారెస్టు నమోనా రశీదు బుక్కు నెం 2 రు 50 పే॥ | | 0 6 0 |
| జవాభా రిజిస్టరు 50 పేజీలు | ... | 0 6 0 |
| డిటో డిటో 100 పే॥ | ... | 0 12 0 |
| డిటో డిటో 150 పే॥ | ... | 1 2 0 |
| డిటో డిటో 200 పే॥ | ... | 1 6 0 |



# రామా బొమ్మలపటములు. సైజు 10"×15"

18 జంతువులు, 10 పక్షులు, 4 వృక్షములు, 3 పాదులు, 3 పుష్పములు, 3 జల, 3 భూచర, సరీసృపములు. (మొత్తం 43)

సృష్టిపరిశీలనా పాఠములు బోధించుటకు మిక్కిలి సహాయపడును. ప్రతిబడికిని ముఖ్యావసరము ప్రతి పటమునకును సంగ్రహచరిత్ర క్లుప్తముగ వ్రాయబడినది. బడి గోడలకువేసిన అందముగ నుండును.

| | | | |
|---|---|---|---|
| ఒక్కొక్క పటము | 0- 1-0 | 43 పటముల పూర్తి సెట్టు | 2-0-0 |
| డజను | 0- 9-0 | డిటో బైండుచేసిన పుస్తకములు | 2-4-0 |

స్వాభావిక సిద్ధములైన ప్రకృతి దృష్టాంతములను, నీతులను తెల్పుచూ అట్టివానిలో ముఖ్యమగు యీక్రింద పేర్కొనిన వానిని పెద్ద అక్షరములతో గ్లేజు కాగితముల పైన ప్రత్యేకము ప్రాథమిక బడుల బాలబాలికల ప్రస్తుత విద్యావిధానమున కుపకరించునట్లు తయారు చేయించితిమి.

[10"×15" మొ 15"×20" సైజులలో ముద్రింపబడినవి.]

| | |
|---|---|
| 1. పంచరంగులు | 4. మాతృపంచకము |
| 2. షడ్రసములు | 5 నవరసములు |
| 3. అష్టకష్టములు | 6. నవధాన్యములు |

ఒక్కొక్కటి 0—0—9 సెట్టు 0—3—0

ఈక్రిందిసెట్లు ముద్రింపబడి సిద్ధముగా నున్నవి.

| | |
|---|---|
| 6 నీతివాక్యములు | 6 విధులు |
| 6 వ్యవసాయ సామెతలు | 12 ఆరోగ్యసూత్రములు |
| 6 నిత్యకృత్యములు | 12 నీతులు |

పై 48 నీతిసూత్రముల సెట్టు గ్లేజుకాగితములపైన 0—8—0

వలయువారు:—రామా అండ్ కో., ఏలూరు.

# Andhra Rashtra Prarambha Vidya.

This is one of the Telugu Educational monthly magazines widely read and appreciated by a large section of the Educational Officers Advertisements both in English and Telugu will be thankfully accepted. The rates of advertisement are very moderate and Advertisers can insure popularity and success in their business by getting their advertisements published in this renowned Educational Review.

## RATES OF ADVERTISEMENT.

| | Full Page. | Half-a-Page. | One-Fourth Page. |
|---|---|---|---|
| For one month | 5—0—0 | 3—0—0 | 2—0—0 |
| For three months | 13—8—0 | 8—8—0 | 5—8—0 |
| For six months | 25—0—0 | 15—0—0 | 10—0—0 |
| For one year | 48—0—0 | 28—0—0 | 18—0—0 |

*N B* — An extra charge of Re 1—0—0 for insertion of the advertisement on the title page.

Contract Rates on application.

**Apply sharp to:—**

**Messrs. RAMA & Co.,**

**ELLORE.**